శ్రీరస్తు.

కావ్యాలంకారసంగ్రహము

అను నామాంతరముగల

# నరసభూపాలీయము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1920




కావ్యాలంకార సంగ్రహ మనునామాంతరమున నలరు నీ నరసభూపాలీయ మనునలంకారగ్రంథమును దెలుఁగున రచియించినమూర్తికవి లక్షణకవులలో నొకఁడు. విద్యానాథుఁడు సంస్కృతమున వ్రాసినప్రతాపరుద్రీయ మనునలంకారశాస్త్రము నీతఁడు పద్యకావ్యముగా వ్రాసెను. విద్యానాథుఁడు కృతిపతినామధేయాంకితముగ లక్ష్యభాగమును వ్రాసినట్లే యీభట్టుమూర్తియుఁ గృతిపతి యగునరసభూపాలుని పేరట లక్ష్యభాగమును వ్రాసియున్నాఁడు. సంస్కృతమున విద్యానాథునికవిత్వమెంతశ్లాఘాపాత్రమో ఆంధ్రమున నీతనికవిత్వము నంతశ్లాఘింపఁదగిన దని చెప్పుటకావంతయు సందియములేదు. వసుచరిత్రము లోనగుగ్రంథములు వ్రాసినరామరాజభూషణుఁడే యీమూర్తికవి యని కొందఱును, కాదని కొందఱును వాదింతురు. నిష్పక్షపాతబుద్ధితోఁ బరిశీలింప వీరిరువురకవిత్వ మేకరీతిగనే యున్నదని తోఁచెడిని. వీరిచరిత్రవిషయ మిచ్చట పెంచి వ్రాయఁబూనుకొనము. అవిషయమును నిర్ణయించు గ్రంథములు వేఱు. మాపని యదికాదు. గ్రంథమును గూర్చిమాత్రము వ్రాయుపని మాదైయున్నది. ఇప్పనిని జేయఁబూని శాఖాచంక్రమణముగాఁ గవికాలము మొదలగు వానిని నిర్ణయింపఁబోవుట "నీవీబంధనవేళాయాం వస్త్రమూల్యపరీక్షణమ్" అను న్యాయము ననుసరించినట్లై యగును. కాఁబట్టి చరిత్రగ్రంథకర్తల శాభాగమును వదలితిమి.

ఇమ్మహాకవి కవిత్వ మసమానమై, యమృతముంబోలి కవివిబుధజీవనాధారమై, హృదయంగమమై చెన్నారుచున్నది. నిఘంటువులఁ జెంత నునిచికొని యొక్కొక్కపదమునే యేర్చికూర్చినకవిత్వము వలెఁగాక యీతని కవితాధార దివిజగంగాప్రవాహముంబోలి యనివార్యవిజృంభణము గలదియై పెంపొందుచున్నది.

భారత భాగవత రామాయణాదులు చరిత్రముతో సంబంధించినగ్రంథములు. అట్టి గ్రంథములయందుఁ గవి పలుపోకలం బోవచ్చును. ఈగ్రంథ మట్టిదికాదు. అలంకారశాస్త్రము గావున స్వేచ్ఛగా స్వకపోలకల్పనలఁ జేర్చుట కవకాశ మీయదు. అట్లయ్యును గ్రంథమును రసవంతముగను, మృదుపదసంఘటితముగను జెప్పి తనకవితామహిమను జూపియున్నాఁడు. కవియే తనకవితామహిమను గూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు.

"స. బాణవేగంబును భవభూతిసుకుమార,తయు మాఘుశైత్యంబు దండిసమత
యలమయూరుసువర్ణకలన చోరునియర్థ, సంగ్రహమ్మును మురారిశయ్యానేర్పు

సోముప్రసాదంబు సోమయాజులనియ, మంబు భాస్కరునిసత్కారఘటన
శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధి, యమరేశ్వరునిసహాప్రముఖదృష్టి
తే. నీకఁ గల దటుగాన ననేకవదన, సదనసంచారఖేదంబు నడలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాగుకొనియె, మూర్తికవిచంద్ర విఖ్యాతకీర్తిసాంద్ర."

ఇది యతిశయోక్తి యని తలంపరాదు. చెప్పినట్లు చేయుట సామాన్యముగ నందఱకు నలవిగానిపనియే కాని యీతఁ డట్లుచేయఁజాలినవాఁ డని సులభముగఁ దోఁచును.

అప్పకవీయాది లక్షణగ్రంథము లొప్పని రేఫద్వయమైత్రి, యిత్వసంధులు మొదలగువానిని అచ్చటచ్చట నీకవి యుపయోగించి యున్నాఁడు.

రేఫద్వయమైత్రికి.

"వేఱవివరింప నేల బంగారమునకుఁ, జటులసౌరభ్యలహరి యబ్బుటయకాద."

"శా. శ్రీరంగప్రభుతిమ్మశౌరి భుజకాక్షేయంబుచేనాజుల
స్వైరారాతులఁ ద్రుంప నాక్షితిపతుల్వేవేగ మార్తాండునిం
దూఱందూఱఁ దదీయమండలసముద్భూతవ్రణశ్రేణికి
స్నరంధ్రావిధచూర్ణభాతిఁ దగుఁ నెంతేఁ దచ్చమూరేణువుల్."

ఇంక నీకవి కవితాశక్తినిగుఱించి కొంచెము వ్రాసెదము. ఈమూర్తికవికి నతిశయోక్తి క్రమాలంకారాదులు మంచినీళ్లప్రాయములు.

ఈక్రిందియుదాహరణము లీవిషయమును దేటపఱచును.

క్రమాలంకారము.

"సీ. కమలాప్త కమలాప్త కమలాప్తసన్నిభుం, డేవిభుండు రుచి ప్రభావ దయల
గోరాజగోరాజగోరాజసంకాశుఁ, డేరాజు మతి భోగ గౌరవముల
హరిపుత్త్ర హరిపుత్త్ర హరిపుత్త్ర సదృశుఁడే, ధన్యుండు జయ రూప దానవిధుల
నాగారి నాగారి నాగారికల్పుఁ డే, మేటి ప్రాభవ వేగ పాటవముల
తే. నతఁడుసువిచారుఁడవికారుఁడనఘుఁడలఘుఁ, డప్రమేయుఁడజయ్యుఁడతిప్రతాపుఁ
డప్రతీపుఁ డనేకలోకాభివంద్య, చరితుఁ డింపొందు వల్లభక్ష్మావరుండు."

అతిశయోక్తి.

"ఉ. భూనుతశౌర్యుఁ డోబనృపపుంగవుఁ డుగ్రరణోర్వి భీమబా
హానిశితాసిధార ఘనతాహితకోటియుదస్తహస్తము

ట్వాని హరింపఁ దద్గళితభూరిసమున్నతఖడ్గము ల్వర
స్థానము చేసిన ట్లమరు సారెకు వారికి నూర్ధ్వయాత్రకున్."

### అద్భుతకల్పన.

"సీ. బలఘాతధూళిచేఁ బందిళ్ళు సమకట్టి, యహితరక్తము కలయంపి చల్లి
నవయశోరుచివితానవితానములు గట్టి, వివిధవాద్యధ్వను లెల్లయఁ జేసి
విమతాస్థిపటలచూర్ణముల ముగ్గులు పెట్టి, ద్విజపరంపరలకు విం దొనర్చి
దళితారికుంభిముక్తాఫలంబుల నేస, చల్లి ప్రతాపాగ్ని సాక్షి గాఁగ
తే. మెఱయు నేరాజు విజయలక్ష్మీవివాహ, విదితసన్నాహుఁడై యతఁ డగురుగుండె
పిటికికండయు లేనిగభీరఘోర, రణజయోత్సాహి పానెమరామవిభుఁడు."

"చ. చకచక మించుసింగనృపచంద్రునిశాతకృపాణవల్లిలోఁ
బ్రకటవిరోధియోధరథభద్రగజాశ్వవరూథినీకదం
బకములు గానవచ్చు సులభప్రతిబింబితమూర్తులై మహా
జికలితసాధ్వసోదయముచే నసిగర్భముఁ జొచ్చెనో యనన్."

### నిరుపమానశ్లేష.

"సీ. ఖరదూషణాఖర్వగర్వనిర్వాపణం, బాజి నెవ్వానిసాయకనికాయ
మధికతారావరాహంకారవారణో, ద్వేల మెవ్వనియశోవిమలశోభ
వివిధారికామినీవిఘటనాటోప మే,యవనీశురోపారుణాక్షీ రేఖ
పౌలస్త్యనిరసనప్రౌఢిమాఢౌకితం, బే రాజుచారిత్రచారుభూతి
తే. యతఁడు కలియుగనవ్యరామావతార, చారుతాసార్థనామప్రచారుఁ డగుచు
వెలయు బ్రహ్మాండపేటికావితతకీర్తి, ధనుఁడు శ్రీరంగవిభురామధరణిధవుఁడు

### అనన్యసాధ్యమగుశైలి.

"సీ. వనజారికళలచేఁ దనివి నొందించిన, నిలఖేచరుఁడు ప్రాణమిత్త్రు ననిన
వనదంబు తనదుజీవన మెల్ల నొసఁగిన, నెమ్మేను శిబికోసికా మ్మటన్న
నిగిమాని నేసొమ్ము లిచ్చిన సురమణి, మిన్నంది తలఁపులో మెలఁగు చున్నఁ
జేరి పాదము బలి శిరసావహించినఁ, బాథోధి దానెంత భంగపడిన
తే. వారి నెవ్వారిఁ గా దని వసుధ నౌర, నిక్కముగఁ గీర్తికామిని నీకుఁ దక్క
నిదు వైదగ్ధ్యగుణము వర్ణింపఁదరమె, నరసుతాటోప తొరగంటినరసభూప."

ఇట్లు చూపఁబూనిన గ్రంథమంతయు వ్రాయున ట్లగును. కావున స్థాలీపులాక న్యాయము ననుసరించి కొన్ని చూపితిమి.

జటప్రోలు సంస్థానములోని యాస్థాన లగు పండితు బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివ శాస్త్రులవా రిందలిమూఁడవయాశ్వాసమునకు బాగుగా విమర్శించి విశేషములు పెక్కు చేరిచి విపులముగా వ్యాఖ్యానము వ్రాసియున్నారు. అందచ్చటచ్చట లక్షణపద్యములలోని లోపములఁ గనిపట్టి సవరణలు చేసియున్నారు. ఆ సవరణ లిందు దిగువునఁ బొందు పఱుపఁబడియున్నవి. వారి సవరణలను మే మిం దుపయోగించు కొన్నందులకు, ఆంధ్రభాషాప్రపంచమున కావ్యాఖ్యానముచే శ్రీ శాస్త్రులవారు గావించిన మహోపకారమునకును వారి కనేకవందనము లొనరించుచున్నారము.

మొదటికూర్పునందుఁ బ్రమాదవశంబునఁ బడిన తప్పులు దిద్ది యీకూర్పున నీగ్రంథరత్నమును నలంకరించితిమి. ఇందేమేని పొరపాటు లుండవచ్చును. వాని నిఁక మీఁద ముద్రించునపుడు సవరించుకొందు మని సరసమతులకు విన్నవించుచున్నాము.

నిందతు నందతు వా సన్నసూయు రనసూయు రత్ర కిం తేన,
యత్స్నానసగమనాయై వేదం మమ తు పాథేయమ్.

చెన్నపురి.<br>18-5-18

ఇట్లు,<br>వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

# నరసభూపాలీయము

## కావ్యాలంకార సంగ్రహము.

---



### గ్రంథాదికృత్యములు.

లీలావతి దా నురోమణిసభా సింహాసనత్కౌస్తుభా
వేలాభా ప్రతిబింబితాంగి యయిన న్వే ల్లోకృతం దాల్చినాఁ
డౌలే యంచుఁ దలంచునో యన యమం దానందుఁ డై లక్ష్మి నే
వేళం గౌఁగిటఁ జేర్చుశౌరి నరసోర్వీనాథునిం బ్రోచుతన్. 1

సీ. ఏలేమ కడలిరాచూలి యౌ పెటిఁగించుఁ, గలితవళీతరంగములరంగు
ఏమానినీరత్న మిందుసోదరి యౌటఁ, బ్రకటించుమొగముపోలిక తెఱంగు
ఏతన్వి కందర్పమాత యౌ పెటిఁగించుఁ, గరగృహీతాంభోజకాండకలన
ఏసాధ్వి దనుజారియిల్లా లవుటఁ దెల్పు, నలి వినీలాబ్జజిన్నయనగరిమ
తే. యట్టి శ్రీదేవి సుకవివాగమృతదంబు, నఖిలభువనోన్నతము నైనయాబలేంద్ర
నరసవిభుమందిరం బాత్మశరణమనుచు,నుండి యేకాలమును బాయకుండుఁగాత. 2

చ. పలుకులకొమ్మ నెమ్మొగముఁ బార్వణచంద్రునిఁ గాఁ దలంచి యు
జ్జ్వలనిజభద్రపీఠజలజంబు నిమీలిత మౌనో యంచు నే
ర్పలవడ భారతీవనిత నాత్మముఖంబులలోన దాల్చుచుం
దెలుఁగువిధాత యోబయనృసింహున కిచ్చుఁ జిరాయురున్నతుల్. 3

సీ. ఒకటి యక్షరవిలాసోల్లాసమున మించ, నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల
నొక్కటి నారికేళోన్నతిఁ దాల్ప నొక్కటి గోస్తనీగుచ్ఛకలనఁ దనర
నొకటి సువృత్తభావోన్మేష మొంద నొక్కటి వల్లకీతుంబికలనఁ దెలుఁగ
నొకటి భారవిశేషయుక్తిఁ బెంపొంద నొక్కటి గిరీశమతానుకారి గాఁగ
తే. వసమసాహిత్యసంగీతరసము లెసఁగు, గుబ్బపాలిండ్లు దాల్చుపల్కులవెలంది
సరసగుణహారు నోబయనరసధీరు, నవ్యకృతినాయకునిఁ గా నొనర్చుఁగాత. 4

శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నక్షైకోలు గావించి త
ద్ధాంగీకారమునం బురంధ్రి నిను వామాంగంబునం దాల్పనే

శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజ స్వీర్షాపగాబింబిత
స్వాంగానందితఁ జేయుశంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్. 5

చ. అరుదుగ వామభాగలలనాకలనాచలనాత్ముఁ డైనయా
హరు గుఱుఁ గాంచి తానును దదాకృతి యాగతి నేకదంతుఁడై
కరికరిణీగుణంబులు మొగంబునఁ దాల్చి జగంబు లేలునాం
తరకరుణాసనాథు గణనాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్. 6

సీ. తనయాస్యగహ్వరంబునకు ఖద్యోతజృం,భణము ఖద్యోతజృంభణము గాఁగ
దనకరాంభోజాతమున కలగంధమా,దన మొకగంధమాదనము గాఁగఁ
దనశౌర్యహార్యక్షమునకు మైరావణ,స్ఫురణ మైరావణస్ఫురణ గాఁగఁ
దనవాలదంభోళి కెనయుకర్బురగోత్ర,గరిమ కర్బురగోత్రగరిమ గాఁగ
తే. వఱలురామానుజన్మజీవప్రదాన, ధుర్యపర్యాయధాత మేదురవిరోధి
బలపయోధివిలంఘనప్రబలశక్తి, యోబయ నృసింహభూభర్త కొసఁగుఁగాత. 7

సీ. ఎవ్వాఁడు మొదలఁ దా నిలకు భారతి డించెఁ, దగ భగీరథుఁ డభ్రతటినిఁ బోలె
భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు, వాగ్దేవి దాన యై వన్నె కెక్క
వరవృత్తములు మాని వాణి యెవ్వానికై, వలచి నానాశ్లేషములకుఁ జిక్క
నెవ్వానివాఙ్మాత్ర మినుని ధాత్రికిఁ దెచ్చి, పేర్మితోఁ గరము లర్పించుకొనియె
తే. వట్టిమహిమాధికులఁ గొల్చి యఖిలమునివ
చోనుపమశక్తిభృతపురాణార్థవితతు
లనుఁగుఁదెనుఁగ నుభవ్యదివ్యాంజనమునఁ
గనుఁగొనఁగఁ జేయునంధ్రసత్కవులఁ దలఁచి. 8

సీ. ఏమహాత్ములు గల్గ భూమీశసభలలోఁ, గవులకు నధికవిఖ్యాతి గల్గె
నేకృతార్థులు గల్గ నెల్లపామరులకు, గణన మీరుప్రబంధకములు గల్గె
నేవాఙ్నిధులు గల్గ నిరవొందురసికుల, కమితలీలావినోదములు గల్గె
నేప్రవీణులు గల్గ నిల నలంకృతికృతో,ద్యములకు దోషలక్ష్యములు గల్గె
తే. నేదయాళులు బుధవచోహేతిచకిత, విసరదపశబ్దభరణలాలసముఖాబ్జు
లట్టినిఖిలోపకారధీరాత్ములయిన, సకలకవిధూర్వహులకు నంజలి యొనర్తు. 9

వ. ఇవ్విధంబునఁ బ్రారిప్సితగ్రంథనిర్విఘ్నపరిసమాప్తిసంప్రదాయావిచ్ఛేదలక్షణ
నిబంధనంబు గా నిఖిలాభీష్టదేవతానమస్కరణంబును, సుకవిబహూకరణంబును,
కుకవినిరాకరణంబును, గావించి, యుదంచితవిరించిసంచితప్రపంచచరదభంగ
బుధపుంగవహృదయంగమంబును, గంభీరరససముజ్జృంభితకవితాంభోధితరణ
కరణప్రగుణోపకరణపరిణతతరణిప్రకాండంబు, నశేషగుణదోషవిశేషదుర్వారనిర

క్షీరవివేచనోచితప్రశంసితహంసాయమాన ప్రతిమానబంధంబు సగుణోక్తప్రబంధంబు నివర్తింపఁ బూనియున్నసమయంబున. 10

సీ. లలితాకలంకకలాకలాపంబున, నేరాజు రేరాజు నేవగించి
భూభారభరణలీలాభిముఖ్యంబున, నేమేటి తామేటి నెగ్గులాడుఁ
జతురభాషామహీషావిశేషావాప్తి, నేభోగి యాభోగి నిసడించు
శరణాగతగణాతిభరణాధికగుణాప్తి, నేశౌరి యాశౌరి నేపు నూపు
తే. నతఁడు రిపురాడఖర్వగర్వాంధకార, గంధనిర్గంధనాంభోజబంధుబంధు
బంధురావార్యశౌర్యధురంధరుండు, సరసగుణహారుఁ డోబయనరసఘనుఁడు. 11

వ. వెండియుం బ్రచండభుజాదండతాండవమండలాగ్రఖండితారాతిమండలుండును నఖండ నవఖండపృథ్వీమండలధురాభరణపరాభూత ఖండపరశుకుండలుండును నజాండకరండ పిచండిలయశఃపూగకర్పూరహాసుండును సరస్వతీమనోభండారచౌర్యకారుండును సమరసమయసముజ్జృంభితజంభారిదోస్స్తంభ సముత్తంభిత దంభోళి ధారావిదారితమహాభీలశైలాళివిశాలరవకోలాహల లీలాహళహళికా సమారంభ సుభగంభావుకగంభీర విజయభేరీ భయంకరభాంకారసంకరసముట్టంకిత దిగ్విటంకుండును నక్షుద్రతరసురక్షోభకరమదోన్మత్తరక్షోన్నతరక్షోవరక్షోవిక్షోదవిచక్షణాక్షీణనృహర్యక్షరూక్షపక్షిణీధవదాశుశుక్షణిక్షణసముత్క్షిప్త కీలాకరాళావిచ్ఛిన్నాచ్ఛచ్ఛాయాచ్ఛటాపటిమఘటనచటుల ప్రతాపవైభవుండును నుభయరగండగండభేరుండాదిబిరుదామందసందీపిత ప్రాభవుండును నసాధారణ మేధావిదారిత వేధోమేధోపబోధనిర్నిరోధమధురమధురసావధీరణ సమగ్ర వాగ్గ్రిధవధన సుధీజనగృహద్వార నిర్నిద్రభద్రవారణఘటావికటకటకటాహతట పతదనూనదానాంభోఝరీపరిమళ పరిలబ్ధిలుబ్ధలబ్ధామోదమధుర భృంగీతరంగితభంగీ ప్రసంగత ప్రసంగాంగీకృత నిరంతర దిగంతర విశ్రాంత విశ్రాణనజయావకుండును గుళికసుతకులజలధిజైవాతృకుండును నానావిధఖానాధిక సేనాంబునిధానా నుపమానాహవమానామితామోఘవైఖరీ పరీతబరీదసపాద సప్తాంగహారుండును భోజరాజవంశసంభవుండును లక్కాంబాగర్భపావనుండును బరమభాగవతసంభావనుండును నోబభూపాలపుత్రవరుండును గడిదుర్గస్థాపనాచార్యుండును సత్యభాషాహరిశ్చంద్రుండును నగునృసింహక్షితీంద్రుం డొక్కనాఁడు రుచిరగుచిశుచితావిశేషదూషితోషర్బుధులు బుధులు సరస్వతీప్రవాహ సంతతవిహారమాణమహాకవులు కవులజిహ్వాజిహ్వారంగనృత్యదుత్తుంగగైర్వాణ వాణీప్రాకృతశౌరసేన్యపభ్రంశపైశాచికామాగధులు మాగధులు నటనజితమహానటులు నటులు వరయౌవనసౌందర్యవసతులు సతులు నయవినయసౌజన్యులు రాజన్యు లవధీరిత సురరాజమంత్రులు మంత్రులు ప్రబలబలోద్భటులు భటులు పురోహి

తులు హితులు పౌరాణికులు వైణికులు గాయకులు గణికులు నాదిగాఁ గలనిఖిల
నియోగిజనంబులు బలసి కొలువ మణిమయాస్థానమధ్యభద్రాసనంబున సుధర్మాసీ
నుం డగుశునాసీరుచందంబున నందంబుగాఁ గొలువుండి యప్పుడు. 12

సీ. శతలేఖినీపద్యసంధానధౌరేయు, ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యని,రోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య, సాధితవ్యస్తాక్షరీధురీణు
నేకసంధోచితశ్లోకభాషాకృత్య,చతురునోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
తే. నమితయమకాశుధీప్రబంధాంకసింగ, రాజసుతతిమ్మరాజపుత్త్రప్రసిద్ధ
సరసవేంకటరాయభూషణసుపుత్త్రు, నను బుధవిధేయు శుభమూర్తినామధేయు.

క. కనుఁగొని దయామరందము, కనుఁదమ్ములఁ గ్రమ్మ నుచితగౌరవలీలా
ఘనతరగభీరభాషల, ననియె న్నరసింహుఁ డభినవానందములోన్. 14

సీ. బాణవేగంబును భవభూతిసుకుమార,తయు మాఘుశైత్యంబు దండిసమత
యలమయూరునువర్ణకలన చోరునియర్థ, సంగ్రహమ్ము మురారిశయ్యానేర్పు
సోముప్రసాదంబు సోమయాజులనియ,మంబు భాస్కరునిసన్మార్గఘటన
శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధి, యమరేశ్వరునిసహస్రముఖదృష్టి
తే. నీక కల దటుగాన ననేకవదన, సదనసంచారఖేదంబు సడలుపఱిచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె, మూర్తికవిచంద్ర విఖ్యాతకీర్తిసాంద్ర. 15

ఉ. కావున నీయుదగ్రమతిగౌరవయోగ్యనిరూపణంబుగా
నీ వొనరింపఁ బూనినయనేకమహాకవివాఙ్మయోపకా
రావహమైనకావ్యము మదంకితమై వెలయంగఁ జేయుము
ర్వీవలయప్రసిద్ధబుధవిస్మయదానధురంధరంబుగన్. 16

వ. అని సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలజాంబూనదాంబరాభరణచ్ఛత్త్రచా
మరాందోళికాచతురంతయానాగ్రహారాది ప్రదానంబుల బహూకరించుటయు
నేను నానందకందళితతరంగితాంతరంగుండనై. 17

సీ. నిజరూపమునకు వన్నియ దెచ్చు వేఱొక్క, బెళుకొందు ధ్వని హీరకళిక లమర
ఛాయాంతరాలక్ష్యసహజతేజము లైన, లక్షణవైదూర్యలక్ష్మ లలర
రతులతోఁ దులఁదూఁగు రమణీయరసవిశే,షములను గారుత్మతములు మెఱయ
గురుసువర్ణగుణైకగుంభితస్థితిఁ దాల్చు, నాయకనాయకోన్నతులు సెలఁగ
తే. నిల నలంకారనికరంబు లిరవుకొలిపి, కమలభవగేహినీపరిష్కరణకరణ
యోగ్యములుగా నొనర్చినభాగ్యనిధుల, భామహాదుల ననిశంబు ప్రస్తుతించి. 18

క. వారిప్రసాదమున నలం, కారము ధ్వని లక్షణాధికారరసాలం
కారము నొనర్తు నాంధ్రవ, చోరచనచమత్క్రియాభిశోభితమగు నై. 19

తే. అసదృశరసప్రధానశబ్దార్థములును, రీతులును వృత్తులును నలంకృతులు గుణము
లాది యగులక్షణంబుల నలరఁ గావ్య, సరణి యందు రలంకారసారవిదులు. 20

క. ఈకావ్యలక్షణంబు ల, నేకులు దొల్లింటిపెద్ద లేర్పఱిచిన సు
శ్లోకనృపచరితనుతి దీ, ప్తాకలనయు నభినవాంధ్రకవితయు నగుటన్. 21

వ. ఏతత్ప్రబంధబంధురావ్యాజ కావ్యాలాప లక్షణ కృతక్షణ ప్రసంగ సంగ్రహణ
నిర్వహణకృత్యంబున నిత్యంబు నత్యంతకృతావసరుండ నై.

క. బంధురతరప్రబంధుల, బంధముల కనంతకీర్తిభాగ్యప్రదధా
రంధర్యగ్రంథిలము వ, సుంధరననవద్య రమణసుగుణస్తనముల్. 28

సీ. రామాయణాదికగ్రంథంబు లనవద్య, నేతృవర్ణనల నెన్నిక కెక్కె
వైశేషికాదినానాశాస్త్రములు శివ, ప్రతిపాదనమున సన్నుతి వహించె
సంధ్యాదిమంత్రము ల్పరమేశ్వర నామ,జపసాధనత ననశ్వరము లయ్యెఁ
బలుకు లొండొంటికిఁ బ్రామిన్కులును బర, బ్రహ్మగోచరములై ప్రణుతిఁ గాంచె

తే. ననినఁ గావ్యం బమేయనాయకవికస్వ, రస్వరూపనిరూపణభ్రాజి యగుట
వేర వివరింప నేల బంగారమునకుఁ, జటులసౌరభ్యలహరి యబ్బుటయ కాదె. 24

శా. వేదంబుల్ నృపశాసనంబులు సుహృద్విజ్ఞాపనంబు ల్పురా
ణాదిగ్రంథము లంగనాజనవిలాసాలాపలీలాసమ
ప్రాదుర్భావము లౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాదప్రక్రియ లెన్నఁ గావ్యమహిమ ల్వర్ణింపఁగా శక్యమే. 25

మ. పరమజ్ఞానలతాలవాలము జగత్ప్రఖ్యాతవిఖ్యాతసా
గరచంద్రోదయ మిష్టసంఘటనరేఖా దివ్యధేనూత్తమం
బురుకార్పణ్యదశానిశాదినముఖం బుద్వేలనిర్వాణభ
వ్యరసాస్వాదరసాయనం బనినఁ గావ్యం బెన్న సామాన్యమే. 26

క. కావున నేవంవిధసుగు, ణావాసం బైన కావ్యము లరుదు నవర
త్నావేలహారవల్లిక, కై వడి ననవద్యనాయకభ్రాజితమై. 27

మ. అని యూహించి మదీయసంఘటిత కావ్యాలంక్రియాసంగ్రహం
బనఘం బై వెలుఁ గొందకున్నె రవివంశాధీశ్వరుం డౌ నృసిం
హనృపాలాగ్రణికీర్తివర్ణనముచే నాశాంతవిశ్రాంతపా
వనమౌఁ గావున నందు నాయకమహావంశంబు వర్ణించెదన్. 28

## నాయకవంశవర్ణనము.

సీ. శ్రీమించు పద్మినీభామామణికి నుండు, నిరతసంసారవార్నిధికిఁ దరణి
త్రిజగతీసజ్జనశ్రేణికి మిత్త్రుండు, బహుళతమోవనికి విభావసుండు
సమదమందేహదేహములకుఁ దపనుండు, చతురాగమార్థసంతతికి సవిత
సకలచోరపరంపరకు సహస్రకరుండు, వినతలోకవితానమునకు ద్యుమణి
తే. హరిహరవిరించిముఖదేవతానుభావ, ఘనతరస్వర్ణకారు లొక్కటియ కాఁగఁ
గరఁగికూర్చినయపరంజికడ్డి యనఁగ, సూర్యుఁడిరవొందుఁదేజోనివార్యుఁడగుచు.

క. ఆతనికి వైవస్వతమను, వతనికి నిక్ష్వాకునృపతి యతనికిఁ గుక్షి
క్షితిపతి యతఁడు వికుక్షిం, బ్రతాపఘనిఁ గనియె నతఁడు బాణునిఁ గనియెన్. 30

సీ. అనరణ్యుఁడతనికా యనఘుఁడుపృథుఁ గాంచెఁ, బృథుఁడు త్రిశంకుధాత్రీంద్రుఁ గనియె
నతనికి దుంధుమారాభిఖ్యుఁ డతనికి, మాంధాత యతఁడు సుసంధిఁ గాంచె
నతనికి ధ్రువసంధి యతనికి భరతుఁ డా, ధన్యున కసితుఁ డాతనికి సగరుఁ
డతనికి నసమంజుఁ డతఁ డంశుమంతునిఁ, గనియె దిలీపుఁ డాతనిసుపుత్త్రుఁ
తే. డతఁడు గాంచె భగీరథు నాత్మవంశ, పావనుని నాతనికిఁ గకుత్స్థావనీశుఁ
డతఁడురఘుఁగాంచెఁ గనియె నాక్షితితలైక, పతిసునాభాగునతఁడునాభాగుగాంచె.

చ. అతనికి నంబరీషుఁ డయుతాయువు తత్సుతుఁ డవ్వసుంధరా
పతి గనియె న్మహాత్ము ఋతుపర్ణు నతండును సత్యకాము నా
తత బలుఁగాంచె నాతఁడు సుదాసునిఁ గాంచెఁ దదీయుఁ డస్త్రకుం
డతనికి మూలకుం డతని కాశతసంఖ్యరథుండు వెండియున్. 32

క. ఘనుఁ డతఁ డైలబిలేంద్రునిఁ, గనియెం బృథుధర్మవిభునిఁ గనియె నతఁ డతం
డును విశ్వమహునిఁ గనియెం, గనియె న్ఖట్వాంగు నతఁడు గాంభీర్యనిధిన్. 33

సీ. భవ్యుఁ డాతఁడు దీర్ఘబాహునిఁ గనియె నా, తఁడుగాంచె రఘువు నాతనికిఁ గలిగెఁ
బురుపాదుఁ డతనికిఁ బొడమెఁ గల్మాషపా, దుఁడు తత్సుతుఁడుశంఖనుఁడుసుదర్శ
నుఁడు దత్తనూజుఁ డాతఁడు గాంచె నగ్నివర్ణమహీశు నతఁడు శీఘ్రగునిఁ బడసె
నతనికి మరుఁడు దదాత్మజుఁడు శుకుఁ డా, తని కంబరీషుఁ డాతనికి నహుషుఁ
తే. డతనికి యయాతి నాభాగుఁ డతని కతని, కజుఁడు దశరథుఁ డతనికి నతనికొదవె
రామభద్రుఁడు దద్వంశరత్నమయ్యె, సారిది గలివేళఁ గలికాలచోళవిభుఁడు. 34

సీ. ఏరాజువివిధపుష్పారాధనమున గం, గాధరుతలమీఁది కొంచు మాసె
నేరాజుదివ్యాన్నసారార్పణంబున, శితికంఠుమెడ నున్న చేఁదు మాసె

నేరాజు రణోర్విపహారానుభవభూతి, రుద్రు నెమ్ములదండ రోఁత మానె
నేరాజు కాంచనాగారరచనకేళి, భవునకు గిరు లెక్కపాటు మానె
తే. జలధి దేవేరిఁ గావేరి జనులు నూడ్చ, కుండ నాచ్ఛాదన మొనర్చె నోఱపు మెఱయ
నుభయతటములఁ దరుపఙ్క్తులనిచె నేన్న, పాలుఁ డతఁ డొప్పుఁ గరికాలచోళవిభుఁడు

చ. అతఁడు మహాదిగంతవిజయం బొనరించి సురాద్రియాల ను
న్నతనిజమీనలాంఛన మొనర్చుటకై గిరిరాజుఁ ద్రిప్ప వి
ప్రతిమతదీయదోర్వ్యగభర భ్రమితాచలశృంగసంగతా
మితజనరూఢి నేఁడును భ్రమించుఁ దదగ్రగతిన్ గ్రహావళుల్. 36

తే. శ్రీలఁ జెలువొందు నాకలికాలచోళ, కుంభిని నాఘుకులమున సంభవించె
ఘనఖనిక్షోణి రత్నంబు గలుగురీతి, భోగసౌభాగ్యసురరాజు పోచిరాజు. 37

సీ. తనకీర్తికి జరవాహిని యీడుగామికి, నమ్మహానదితోడి యమున సాక్షి
తనప్రతాపస్ఫూర్తి కినువేఁడి సరిగామి, కతనిబింబము దూఱునటులు సాక్షి
తనధైర్యమహిమకుఁ గనకాద్రి ప్రతిగామి కచటఁ గాఁపున్నగోత్రారి సాక్షి
తనకాంతికి మృగాంకుఁ డెనగామి కతనితో, సరిపొత్తు మనుకర్మసాక్షి సాక్షి
తే. గాఁగ విలసిల్లు ననుపమక్షాత్త్రధర్మ, పరత నృపపఙ్క్తి కెతఁ డోజబంతి యనఁగ
రాజమృగరాజు వైభవరాజరాజు, భూరిసౌందర్యరతిరాజు పోచిరాజు. 38

క. ఆపోచిరాజవంశసు, ధాపారావారమునకుఁ దారాపతి యై
యే పొందుఁ దిరుమలక్షో, ణీపాలుఁ డనంతకీర్తినిత్యోజ్జ్వలుఁ డై. 39

సీ. రక్షించినాఁడు హిరణ్యధారావృష్టిఁ, జతురార్థిసంఘాతచాతకముల
శిక్షించినాఁ డుగ్రకౌక్షేయపవిధారఁ, బ్రతిపక్షగిరిలక్షపక్షగరిమ
వీక్షించినాఁడు సద్విభవాపహవివాహ, సదనంబుఁ గదనంబు సరియ కాఁగఁ
బ్రోక్షించినాఁడు సంపూర్ణదయాధార, వితతావదాతపావృతులమీఁద
తే. నతఁడు రాజన్యమాత్రుఁడె యపరశిఖరి, చరమగహ్వరబంహిష్ఠజరఠతిమిర
పటలపాటనపటుమహాభాస్వరుండు, రాజకులహేళి తిరుమలరాయమౌళి. 40

క. ఇరాజశిఖామణికిన్, ధీరాత్ములు తనయు లైరి తిప్పవిభుఁడు గం
భీరరుణాంభోరాశి య, పారకృపామూర్తి వల్లభక్షితిపతియున్. 41

వ. అందగ్రజుండు.

సీ. తనజయధ్వజమారుతములు వైరికిరీట, ఖచితసన్మణిదీపకళిల మలుపఁ
దనశిలీముఖము లుద్ధతవిరోధిశిరోధి, జలజశోణితరసాసవము లానఁ
దనతేజము లరాతిధరణీశమదవతీ, కబరికానిబిడాంధకార మడఁప
దనవాహినీప్రౌఢి దర్పితప్రతికూల, భూమిభృన్మదభేదమునఁ దలిర్ప

తే. నాజి మాంధాత యనఁ బొల్చు రసికలోక, సతతసంరక్షణాస్తోకజాగరూక
నవనవానందహృల్లగ్న నందగోప, బాలకుం డైనతిప్పభూపాలకుండు.

తే. అతఁడు రామప్రభుని బాసెమాంబయందు, నాబళేంద్రు నిలక్కాంబయందుఁ గనియె
జలజనయనుండు రుక్మిణీజాంబవతుల, యందుఁ బ్రద్యుమ్న సాంబుల నందినట్లు.

క. వారలలోన ధురంధరుఁ, డై రామనృపాలుఁ డమరు నమరపురంధ్రీ
చారుకరగ్రహలీలా, కారణదోరగ్రకుటిలకాక్షేయకుఁ డై. 45

చ. హరిభజనప్రవీణుఁ డగు నాధరణీంద్రుఁడు బైచమాంబికం
బరిణయమై తనూభవులఁ బ్రాజ్ఞులఁ దిమ్మనృపాలు నోబభూ
వరు వరదేంద్రుఁ దిప్పమహిపాల్లభుఁ బాసెమరాజ వేంకటే
శ్వరు నిలఁ జక్రవర్తి సదృశప్రథితాత్ములఁ గాంచె నార్యరన్. 46

చ. అరయఁగ నమ్మహీపసుల క్రగజుఁ డైతగు తిమ్మరాజు ని
ర్భరతరధాటికాతురగపాటనమూర్ఛిత యా ధరాతలో
దరికి నిరామయౌషవిధానము నిర్జరవైద్య వేఁడఁగా
నరిగెడులీల నద్భుతసమగ్రరజోవ్రజ మేఁగు నింగికిన్. 47

క. ధర నతఁడు రామనృపసో, దరి యగుకొండాంబయందుఁ దనయునిఁ గాంచెన్
నరనుతు నెర వేంకటవిభు, హరిసిరియం దతనుఁ గన్నయాకృతి దోఁపన్. 48

సీ. మిత్రగేహములనమిత్రగేహమ్ములఁ, గనకసంఘాత మేఘనుఁడు నిల్పె
ధర్మాగమమున సద్ధర్మాగమమున ని,ర్భరగుణారోప మేరాజొనర్చె
విగ్రహంబున భీమవిగ్రహంబున మహా,విషమాంబకత్వ మేవిభుఁడు దాల్చెఁ
గృతులయందు నిఖిలాకృతులయందును రాగ,భరితవీక్షణ మేనృపాలుఁ డునిచె.

తే. జగతి నేరాజు కువలయోత్సవ మొనర్చు, రాజు గావున నటు స్వీయరక్షచేతఁ
గోరి యన్వర్థ మగుచంద్రగుప్తిదుర్గ, మతఁడు విలసిల్లు వేంకటక్షితివరుండు. 49

తే. అతఁడు తిమ్మాంబయందుఁ దిమ్మావనీశుఁ, జిన్నతిమ్మప్రభునిఁ గాంచె సీతయందు
రవికులోద్ధారకుం డైనరాఘవుండు, గరిమఁ గుశలవవీరులఁ గన్నకరణి. 50

క. ఈసంతతిఁ దగు తిమ్మ, క్ష్మాసుత్రామునకుఁ గూర్మిసహజన్ముఁ డనఁ
భాసిల్లు నోబనృపతి శు, నాసీరమహీజవితరణగుణాస్పదుఁ డై. 51

చ. సరసనఖప్రసూనభుజశాఖలఁ జెంది వచోమరందమా
ధురిఁ జెలు వొంది కీర్తి యనుతోరపువాసనఁ బొంది సొంపునం
బరఁగుదళంబులం బ్రబలి పండితకీరపరంపరాఫల
స్ఫురణ మొసంగు నోబనృపపుంగవుఁ డాశ్రితపారిజాత మై. 52

ఉ. భూనుతశౌర్యుఁడోబన్నృపపుంగవుఁ డుగ్రరణోర్వి భీమబా
హానిశితాసిధార ననతాహితకోటియుదస్తహస్తము
ల్వాని హరింపఁ దద్గళితభూరిసమున్నతఖడ్గము ల్వర
స్థానము చేసిన ట్లమరు సారెకు వారికి నూర్ధ్వయాత్రకున్. 53

క. అతఁ డోబళాంబయందు, ప్రతిముని నోభళనృపాలు రామమహీశున్
క్షితిఁ గాంచె విద్యయం దద్భుతధీనిధి వినయబోధములఁ గాంచుగతిన్. 54

క. తదనుజుఁడు వరదభూపతి, సుదతీమకరాంకుఁ డమరు సురపురవనితా
విదితవరదానచాతురి, గదిసినయాత్మీయనామకము సార్థముగన్. 55

వ. తత్క్రమంబున. 56

సీ. అవనినభోంతరం బాస్యరంధ్రము గాఁగ, ఘనపంక్తి మోముపైకప్పు గాఁగ
హిమశైలవింధ్యశైలములు కొమ్ములు గాఁగఁ, బూర్ణచంద్రుండు మూఁపురము గాఁగ
శరధులు నాలుగు గొరిజపట్టులు గాఁగ, నైలింప నది గంగడోలు గాఁగ
వాసుకి యాభీలవాలదండము గాఁగఁ, దారకల్ కింకిణీతతులు గాఁగ

తే. గరిమఁ జెన్నొందు బసవశంకరమహాంక, వాజి నేరాజశేఖరుం డావహించె
నతఁడు నిలువెల్లమగఁటిమి యనఁగఁ బరఁగు, రామవిభుతిప్పశౌరి నిర్వారితారి. 57

సీ. బలధూతధూళిచేఁ బందిళ్లు సమకట్టి, యహితరక్తము కలయంపి చల్లి
నవయశోరుచివితానవితానములు గట్టి, వివిధవాద్యధ్వను ల్వెలయఁ జేసి
విమతాస్థిపటలచూర్ణముల ముగ్గులు పెట్టి, ద్విజపరంపరలకు విం దొనర్చి
దళితారికుంభిముక్తాఫలంబులసేస, చల్లి ప్రతాపాగ్నిసాక్షి గాఁగ

తే. మెఱయు నేరాజు విజయలక్ష్మీవివాహ, విదితసన్నాహుఁడై యతఁడదురుగుండె
పిఱికికండయు లేనిగభీరఘోర, రణజయోత్సాహి పానెమరామవిభుఁడు. 58

చ. అతనిసహోదరుండు చతురంబుధివేష్టితభూధురంధరుం
డతులితశౌర్యభీకరభుజాగ్రుఁడు వేఁకటరాజు వొల్చు నా
క్షితిపతి దానవాసనల ఖేచరశాఖిఁ దిరస్కరింపఁగా
వితతతదీయదుర్యశము విస్ఫుట మానలిమండలాకృతిన్. 59

క. ఈవంశకర్త యగుతి, ప్పావనిపాలునకుఁ గూర్మియనుజన్ముఁడు దా
నై వెలయు న్వల్లభధా, త్రీవల్లభుఁ డఖిలరాజతేజోనిధియై. 60

సీ. కమలాప్త కమలాప్త కమలాప్తసన్నిభుం, డేవిభుండు రుచి ప్రభావ దయల
గోరాజ గోరాజ గోరాజసంకాశుఁ, డేరాజు మతి భోగ గౌరవముల
హరిపుత్త్ర హరిపుత్త్ర హరిపుత్త్ర సదృశుఁడే, ధన్యుండు జయరూప దానవిధుల
నాగారి నాగారి నాగారికల్పుఁ డే, మేటి ప్రాభవ వేగ పాటవముల

తే. నతఁడుసువిచారుఁడవికారుఁడనఘుఁడలఘుఁ,డప్రమేయుఁడజయ్యుఁడతిప్రతాపు
డప్రతీపుఁ డనేకలోకాభివంద్య,చరితుఁ డింపొందు వల్లభక్ష్మావరుండు. 61

ఉ. వల్లభరాజశౌర్యగుణవైభవ మెన్న విచిత్ర మమ్మహీ
వల్లభువైరిరాజి వనవాటికనుండి నిజాంబుజాస్య త
న్వల్లభ యందుఁ బిల్వఁగ నవార్యతదుజ్జ్వలనామసంస్మృతిం
బెల్లు వడంకుఁ గాంతపయిప్రేమము గొంతనెపంబు సేయుచున్. 62

క. అతులప్రతాపుఁ డా భూపతి ప్రోల్దేవేరియందుఁ బ్రబలునిఁ దిమ్మ
క్షితిపాలునిఁ గాంచెఁ బశుపతి పార్వతియందు గుహునిఁ బడసినభంగిన్. 63

సీ. భోగి మట్టినవానిఁ భోగి జుట్టినవాని, భోగిఁ బట్టినవానిఁ బోలనేర్చుఁ
దమ్మిఁ దాల్చినవానిఁ తమ్మి దొల్చినవానిఁ, దమ్మి మొల్చినవానిఁ దారసించు
మృగమునుంచినవాని మృగముఁ ద్రుంచినవాని,మృగముఁ బొంచినవానిమీఱఁజాలుఁ
గొండ నొక్కినవానిఁ గొండఁ జెక్కినవానిఁ,గొండఁ ద్రొక్కినవానిఁ గాదవసేయు
తే. భరణభూతిజవప్రభాబాహుశక్తి, మతికళాశౌర్యసత్యశుంభత్ప్రభావ
భోగగాంభీర్యగుణములఁ బుడమి నేనృపాలకులు సాటి యాతిమ్మపార్థివునకు. 64

తే. అతఁడుగంగాంబయందోబళావనీంద్రు,మూర్తిఘను సింగవిభుఁగాంచెఁగీర్తినిధుల
నత్రి యనసూయయందుఁ మున్నబ్జగర్భ, కమలనాభకపర్దులఁ గన్నయట్లు. 65

ఉ. వారలలో గభీరగుణవారిధి వారిధిపంక్తిలో సుధా
వారిధి వోలె భూమిధనవర్గములోఁ గనకాద్రి వోలె దో
స్సారము ధీరముం దెగువ సత్యము శౌచము సద్విచార మా
చారము గల్గి పొల్చె బుధసన్నుతుఁ డోబళరాజు ధన్యుఁడై. 66

సీ. అప్పపాలైనశుభ్రాబ్జంబు రుచి యెంత, మాటమోచినయంచ తేట యెంత
నీళ్లు మోచినభవానీభర్తకలి మెంత, బిలము దూఱిన శేషుబలిమి యెంత
తమ్ములతోఁ బోరుతారేశుకళ యెంత, తృణ మైనశరపుంజదీప్తి యెంత
పండ్లిగిలించుకల్పకశాఖిదళ మెంత, విరిసినమల్లెలవీఁక యెంత
తే. యనుచుఁ దనగీర్తి ధవళాబ్జహంసమదన, మథనవరభోగివిధుశరామర్త్యవిటపి
వికచవిచికిలమాలికావితతిఁ దెగడ, వసుధఁ బాలించు నోబభూవల్లభుండు. 67

సీ. ఇతనివైరులు వనప్రతతిలోఁ గాఁ పుండ, నవ్వార్ధియై ధాత్రి యవని యయ్యె
నితఁ డంతరీపంబు లేల ముద్రాసముఁన్నిద్రుఁడై జలధి సముద్రుఁ డయ్యె
నితనియాలము చూఁచి యెల్లవేల్పులు నిమేషము మాన ననిమేష సంజ్ఞఁ గనిరి
యితనిసేనాధూళి హిమనేతువులు గప్ప, గౌరీశుఁ డపు డంధకారి యయ్యె

తే. నితనికరుణాంబురాశిసంభృతతరంగ, సంగతం బై నమనమున సంచరించి
శౌరి నారాయణుం డయ్యె జగతి ననుచు, సుకవులు నుతింతు రాబళక్షోణివిభుని. 69

వ. తత్క్రమంబున.

సీ. చతురాననాధిక శ్రుతిహితశీలుఁ డై, విబుధాన్నదానప్రవీణుఁ డగుచు
వసుమతీభారధూర్వహుఁ డై నృసింహతో, భ్రాజి యై బలిశిరోరత్న మగుచు
నర్జునకరగర్వహరణసత్కీర్తి యై, యతనుశాత్రవధర్మహారి యగుచుఁ
గామపాలాఖ్యుఁ డై గరిమసర్వజ్ఞుఁ డై, నరవరోచిత మైననడత యెఱిఁగి
తే. శౌరి బహురూపవిహరణశ్రమముఁ జెంద, లేక యన్నిగుణంబులు నేకమూర్తి
యందు నిరవొందఁ జేసినయట్లు వొల్చు, మూర్తినిర్జితరతిరాజు మూర్తిరాజు. 70

చ. చిరతరకీర్తి మూర్తినృపశేఖరుఁ డాహవదుర్మదారిభూ
వరులఁ గరాగ్రలోలకరవాలముఖమ్మున గ్రుచ్చి యెత్తుఁ ద
ద్వరవరణాభిలాషయుతవాసవలోకవిలాసినీపరం
పరలకు వీరు వల్లభులు పట్టుఁ డటంచు నొసంగుకైవడిన్. 71

సీ. గురువనీపకుల కాదర మొప్పఁ గొం డని, యొసఁగియుఁ గొండని యొసఁగ కుండు
నమితలావణ్యలీలావాప్తి వే మారుఁ, గినిసియు వేమారుఁ గినియ కుండు
సత్కీర్తిచే సుధాకరదేవసరసుల, నాడియు సరసుల నాడ కుండు
నరులపై నిశితసాయకపంక్తి చేపట్టి, విడిచియుఁ జేపట్టి విడువ కుండు
తే. ఫణిపతికినైన భారతీపతికి నైనఁ, బశుపతికి నైన నల బృహస్పతికి నైన
నవని నవలీలఁ బొగడంగ నలవిగాని, చరితములఁ బొల్చు నాసింగజనవిభుండు. 72

చ. చకచకమించుసింగనృపచంద్రునిశాతకృపాణవల్లిలోఁ
బ్రకటవిరోధియూధరథభద్రగజాశ్వవరూథినీకదం
బకములు గాన వచ్చు సులభప్రతిబింబితమూర్తులై మహా
జికలితసాధ్వసోదయముచే వనిగర్భముఁ జొచ్చెనో యనన్. 73

తే. ఇట్లుసుగుణాభిరాములై యెనయుమూర్తి, ఘనుఁడు సింగక్షితీంద్రుఁడుఁ దను భజింప
నెలమి భీమార్జునులుగొల్వనింపుమీఱు, ధర్మసుతుమాడ్కిఁ దగునోబధరణివిభుఁడు.

సీ. ఘనభుజాశౌర్యరాఘవుఁడు రాఘవదేవ, ధరణీశుఁ డేరాజు తాతతాత
వరనుతుఁ డైనపిన్నమరాజు సౌజన్య, ధన్యుఁ డేరాజన్యుతాతతండ్రి
యమితవైభవుఁ డైనయార్వీటిబుక్కభూ, తలనాథుఁ డేరాజుతండ్రితండ్రి
యసమానదానవిద్యాధురంధరుఁ డగు, రామరాజేంద్రుఁ డేరాజుతండ్రి

తే. యట్టిసోమాన్వయాబ్ధిశీతాంశుఁ డనఁగ, నమరు శ్రీరంగవిభుపుత్త్రియై చెలంగు
లక్కమాంబను పరియించె లలితశీల, నమ్మహాసాధ్విసోదరు లధికయశులు. 75

క. కోనక్షితిపతితిమ్మయ, హీనాథుఁడు రామనృపతి యెఱతిమ్మధరా
జానియును వేంకటేంద్రుఁడు, భూనాయకతిలకు లగుచుఁ బొల్తురు ఘను లై. 76

వ. అం దగ్రజుండు. 77

సీ. లాటీకుచాభోగపాటీరపంకంబు, బోటీముఖాబ్జకర్పూరకలన
గౌళీనవీనాంకపాళీసుకూలంబు, చోళీకుచాళీప్రసూనరాజి
యంగీముఖాభంగసంగీతవాణిక, లింగీవిలాసకేళీమరాళి
భోజీకరస్వచ్ఛరాజీవకాంతికాం, భోజీమహాహీరముకురరేఖ
తే. కుంతలీకర్ణమౌక్తికకుండలప్ర, కాశ మెవ్వానియభినవాకాశదేశ
చంద్రికాయితసత్కీర్తిజాల మతఁడు, ప్రబలు శ్రీరంగవిభుకోనపార్థివుండు. 78

వ. తదనుజుండు. 79

శా. శ్రీరంగప్రభుతిమ్మశౌరిభుజకౌక్షేయంబుచే నాజుల
స్వారారాతులఁ ద్రుంప నాక్షితిపతు ల్వేవేగ మార్తాండునిం
దూఱందూఱఁ దదీయమండలసముద్భూతవ్రణశ్రేణికి
న్నీరంధ్రౌషధచూర్ణభాతిఁ దగు నెంతేఁ దచ్ఛమూరేణువుల్. 80

వ. తత్క్రమంబున. 81

సీ. ఖలు నతిద్రోహి సల్కయతిమ్మని హరించి, సకలకర్ణాటదేశంబు నిలిపె
నతుని వర్ధితునిఁ దత్సుతునిఁ బట్టముఁ గట్టి, కుతుపనమల్కన క్షోణి నిలిపెఁ
బదిలుఁడై రాచూరుముదిగల్లుగప్పంబు, సేయుఁ గాంచి సపాదసీమ నిలిపె
శరణన్నమల్కనిజామునికభయం బొసంగి తదీయరాజ్యంబు నిలిపె
తే. నవని యంతయు రామరాజ్యంబు సేసెఁ
దనగుణంబులు కవికల్పితములు గాఁగ
నలవియె రచింప సత్కావ్యములను వెలయ
భూమి నొకరాజమాత్రుఁడే రామవిభుఁడు. 82

సీ. ఖరదూషణాఖర్వగర్వనిర్వాపణం, బాజి నెవ్వానిసాయకనికాయ
మధికతారావరావహంకారవారణో, ద్వేల మెవ్వనియశోవిమలశోభ
వివిధారికామినీవిఘటసాటోప మే, యవనిశుకోపారుణాక్షి రేఖ
ఖాల స్త్యనిరసప్రౌఢిమాఢాకితం, బేరాజుచారిత్రచారుభూతి

తే. యతఁడు కలియుగనవ్యరామావతార, చారుతాసార్థనామప్రచారుఁ డగుచు
వెలయు బ్రహ్మాండపేటికావితతకీర్తి, ధనుఁడు శ్రీరంగవిభురామధరణిధవుఁడు. 83

సీ. తనభుజాదండకోదండ మఖండమై, యనువేళశరవృష్టి నాచరింపఁ
దనహేతిశతకోటిఘనధారధళ్యమై, ప్రతిపక్షబలభిదాపటిమఁ జెలుప
దననిగ్రహంబు సజ్జనమనోహారియై మంజుఘోషాశ్లేషమహిమఁ జెలఁగఁ
దనవైభవంబు సంతానసమగ్రమై, సురభిసంభృతగుణస్ఫురణఁ జెంద
తే. రాజదేవేంద్రుఁ డితఁ డనఁ దేజరిల్లు, ననఘచాళుక్యనారాయణాంకవివిధ
బిరుదమన్నెవిభాళాదిబిరుదశాలి, ప్రాభవోపేంద్రుఁ డెఱుకమ్మపార్థివుండు.

సీ. అసురారిరాణి నే నధివసించుట యెట్లు, బహువిధాసురవంశభవులయందు
సురలోకధేనుసోదరి నేను నిలుచు టెట్లు, కట గోఘాతపాతకులయందుఁ
ద్రైలోక్యమాత నేఁ దగిలి యుండుట యెట్లు, త్రైలోక్యకంటకోద్ధతులయందు
దేవతారాధ్య నే దిరము గాఁ దగు టెట్లు, కడు దేవతాద్రోహకరులయందు
తే. ననుచు యవనులఁ దెగడి తి న్నాశ్రయించు, వారిసామ్రాజ్యలక్ష్మి నెవ్వాఁడు గొనియె
నాహవోగ్రబరీదసప్తాంగహరణుఁ, డితఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రివిభుఁడు. 85

మ. ప్రతికూలాదనిభృద్విషేదనకళాపారీణమై సంగర
క్షితిలో వేంకటరాజశేఖరునికౌక్షేయంబు కృష్ణాధిక
ద్యుతిఁ జెన్నొందఁ దదీయధారఁ బడి కాదోషాకరు ల్యావన
క్షితిపు ల్గాంచిరి నాకలోకవనితాశృంగారసాంగత్యముల్. 86

మ. బలధుర్యుం డగు వేంకటేంద్రునిమహాబాహాబలాటోప వి
హ్వలుఁడై మున్నతిధావనక్రియ సపాదాభిఖ్యుఁ డైనట్టి యే
దులఖానుం డిదె నేఁడుఁ గ్రమ్మఱ సపాదుం డయ్యె నా నర్మిలిం
దలఁ దత్పాదము దాల్చె భీమరథిపాంతం గాననిత్యోన్నతిన్. 87

మ. స్థిరసంగ్రామజయాభిరాముఁ డగు వా శ్రీవేంకటక్ష్మావరుం
డరయ న్రాజశిఖావతంసుఁ డగుఁ దద్యం బుర్విఁ గాకున్న నీ
ధరణీపాలకు లెల్ల మెచ్చఁగ సపాదక్షోణిభృత్ప్రాప్తి భా
సురదుర్గాధిపతిత్వవైభవభవస్ఫూర్తి న్విజృంభించునే. 88

క. ఈరాజమణులసోదరి, యై రాజిలు లక్కమాంబ యమృతాశనధా
త్రీరుహములకైదింటికి, నారయఁ దోఁబుట్టు వగుర మాంగనపగిదిన్. 89

సీ. ప్రతివచ్చునన్నపూర్ణాదేవి ఘటిశున్న, మిడక సంయమి నలయింప కున్నఁ
బోటి నేయఁగ వచ్చు భాగీరథి నఘంబు, పుట్టి పెకటాఁగరై మురయ కున్న

సరి వచ్చు భూకాంత సకలప్రజాభార,పూర్ణాసహత్వంబుఁ బూన కున్న
రూపింపవచ్చు నరుంధతి నేప్రొద్దుఁ, దనయల్పభావంబు దాల్ప కున్న
తే. నిమ్మహాసాధ్వి కని జను లెల్లఁ బొగడ, నలరు నోబక్షితీశు నర్ధాంగలక్ష్మి
బాంధవావనధుర్యవైభవకదంబ, లలితసద్గుణనికురుంబ లక్కమాంబ.

క. పౌలోమికి నింద్రునకు మ,హాలలితాకృతి జయంతుఁ డాత్మజుఁ డైన
ట్లాలక్కమాంబ కోబన్న,పాలునకు నృసింహధరణిపతి జనియించెన్. 91

సీ. కాశ్యపి తా నాఁటఁ గశ్యపోద్భవుఁ డైన, కాకోదరస్వామిఁ గలయు బెట్టు
ధాత్రి యీ తనపయోధారచేఁ బెరగినఁ, గమఠకులాధీశుఁ గవయు బెట్టు
తగ ధేను వగువేళఁ దర్ణకం బగుధరా,ధరశిరోమణిఁ గూడఁ దలఁచు బెట్టు
తనక యావిర్భవించినపంచనామహా,క్రోడంబుతోఁ గూడి యాడు బెట్టు
తే. తగవుగా దఁచు ఫణికూర్మధరణిధరవ, రాదిభూదారముల మాని యవనికాంత
తనభుజాదండమున నుండఁ దనరుచుండు, సరసగుణహారి యోబయనరసశౌరి. 92

క. అతఁ డిల రామయతిమ్మ, క్షితిపతిసత్పుత్త్రుఁ డగుచుఁ జెలు వొందుగుణా
న్వితుఁ డగుతిరుమలధాత్రీ, పతితనయం దిరుమలాంబఁ బరిణయ మయ్యెన్. 93

సీ. పాలు పగు నేసాధ్వీభుజవల్లి రుక్మిణీ, సత్య యేగరితవాచావిశుద్ధి
జనకనందిని యేవిశాలాక్షిమతిరేఖ, భద్ర యేమగువశోభనవినీతి
యనసూయ యేకుటుంబిని దృష్టి సర్వమం,గళ యేశుభాంగనలలితరీతి
ధృతి సుదక్షిణ యేపతివ్రత కరుణసం,పత్కాంత యేయింతి భవ్యమూర్తి
తే. యట్టిగుణధన్యయై తనయాత్మ యెల్ల, నఖిలపతిదేవతాసంగ్రహం బనంగ
నలరు నరవీరవల్లి తిమ్మావనీంద్ర, శరధిమందారవల్లియై తిరుమలాంబ. 94

తే. ఆమగువయందు నరసింహభూమివిభుఁడు, రసిక సారంగరాజు శ్రీరంగరాజుఁ
గనియె ననఘునిదేవకీకాంతయందు, ఘనుఁడు వసుదేవుఁ డచ్యుతుఁ గన్నపగిది. 95

క. అతఁ డుభయవంశపావనుఁ, డితఁ డన బాలార్కవిజయహేవాకవిభా
వితతియు నమందమంద,స్మితచంద్రాతపము దాల్చు శ్రీరంజితుఁ డై. 96

సీ. ఘనతఁ జేసాఁప నేర్చిన నాఁటనుండియు, శత్రులమీఁదఁ జేఁ జాఁప నేర్చె
ననయంబు నడుగు వెట్టిన నాఁటనుండియు, నరిశిరంబులమీఁద నడుగు వెట్టె
నవనీతము గ్రసించునాఁటనుండియు వైరి,కలయశోనవనీతములు గ్రసించె
నవపాంసుగతిఁ జెందునాఁటనుండియు ఖలా,ఖిలధాటీపాంసుకేళిఁ జెందె
తే. నిలువ నేర్చిననాటనుండియు విరోధి, నృపతిసేనాపతుల గెల్చి నిలువ నేర్చె
నరసవిభునిసిరంగభూనాథవిభుఁడు, ప్రబలెఁ బ్రబలుమనుష్యాఁడు ప్రబలగలఁడు.

వ. ఈకుమారనారాయణుం గాంచినరాజన్యపుంగవునకు. 98

క. ఏతాదృశగుణమణికిధ, రాతలపరిపూర్ణకీర్తిరమణికి జలధి
వ్రాతవృతధరణిభరణస, మాతతనిజభుజభుజంగమగ్రామణికిన్. 99

క. ధన్యునకుఁ దరణికులమూ, ర్ధన్యునకు నిజప్రధానిరత్నవదాన్యం
మన్యునకరాతినృపపర్జన్యునిబంధనవిశేషశతమన్యునకున్. 100

క. అజరగజరజతరజనిక, రజతనుజన్యుకుజపురజిదభుజగగజభు
గ్ద్విజవిజయినిజయశోమయ, సుజననుతధ్వజానకధకశోభానిధికిన్. 101

క. గండరగండని కభినవ, మండలికాఖండమన్నెమార్తాండునకున్
జండప్రతాపపిహితా, జాండునకున్ లోభిమన్నెయరగండనికిన్. 102

క. లక్కాంబానందనునకు, దిక్కాంతాచికురనికరదీపితకుసుమ
ప్రక్కాంతదంతురయశో, ఢక్కానిధి కహితకరిఘటాభీమునకున్. 103

క. గాధేయగోత్రసవనధు, రాధేయున కఖిలసుకవిరాజికశోధా
రాధేయదానవిద్యా, రాధేయుఁనకును ధరామరవిధేయునకున్. 104

క. గర్వితబరీదసేనా, సర్వస్వహరానివార్యశౌర్యునకు సమి
ద్ధూర్వహసపాదభయదా, ఖర్వమహావిజయభేరికాభాంకృతికిన్. 105

క. పీనవమల్కాస్థాపన, మానితకరుణాప్రసంగిమాంగిఘ్యునకున్
ధీనిధికి నృహరిచరణ, ధ్యానవిధానావధానధౌరేయునకున్. 106

క. తోరగంటిదుర్గరాజ్య, స్థిరసింహాసననివాసదీక్షానిధికిన్
వరయంత్రమత్స్యభేదన, బిరుదోద్దండునకు గండభేరుండునకున్. 107

క. ప్రతిదినకనకవసంతా, ర్జితకృతికాంతునకుఁ దురగరేవంతునకున్
గ్రతుపురనారాయణగృహ, వితతప్రాకారఘటనవిఖ్యాతునకున్. 108

క. అరుణారుణకరుణారస, పరిణామసమగ్రనయనపద్మాభునకున్
శరణాగతభరణాపర, నరసింహున కోబశౌరినరసింహునకున్. 109

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినయిమ్మహాలంకారప్రబంధం
బునకు నాదికారణం బగునాయకగుణవ్రాతం బభివర్ణించెద. 110

## నాయకగుణములు.

క. కులము మహాభాగ్యము ను, జ్జ్వలతే యుదారత మహోవిశాలత ధర్మా
కలనయు వైదగ్ధ్యము నన, సిలనాయకగుణము లమరు నివి యేర్పఱుతున్. 111

క. వీనికి లక్ష్యము లెల్లను, శ్రీనరసింహేంద్రుపేరఁ జెప్పెద నెలమి
న్నానావిభక్తిసూచిత, నానావిధపద్యగుంఫనసమగ్రముగాన్. 112

కులీనత.—

సీ. ఏవంశమునఁ బుట్టెఁ బావనశ్రుతిధర్మమార్గకర్ముఁడైన మనునృపాలుఁ
డేవంశమునఁ బుట్టె నింద్రాదులకు దండ, సత్యమాడినహరిశ్చంద్రనృపతి
యేవంశమునఁ బుట్టె నిలఁ జతుర్దశలోకరక్షణదక్షుఁడైన రావణారి
యేవంశమునఁ బుట్టె నిహపరాద్భుతపుణ్యచరితధుర్యుఁడు చోళచక్రవర్తి

తే. యట్టియిందుగ్రహారిసేనాధిపత్య
సత్యయశుఁడైనభానువంశమునఁ బుట్టె
పరఁగుభూపాలసింహు నోబయనృసింహుఁ
దలఁపఁ గలికాలదోషంబు దొలఁగు టరుదె. 113

మహాభాగ్యము.—

మ. ప్రకటాఖిలవిరోధిసైన్యముల ద్రుంపంజాలు నొక్కొక్క సే
నపుఁడే వారణవాజిశాలలు నమద్వైరిక్షితీంద్రార్పితా
ధిక వేదండహయాన్వితంబులు భుజాదీప్తాంగదం బుర్విభా
గ్యకళావైభవ మెన్న శక్యమె నృసింహక్ష్మాతలస్వామికిన్. 114

ఔజ్జ్వల్యము.—

మ. స్థిరసోమాన్వయదుగ్ధవార్ధి జనియించె న్వేంకటాద్రీంద్రభూ
నరచంద్రుండు తదీయసోదరిరమావామాక్షి లక్కాంబ యై
పరఁగెం దద్వనితాశిరోమణికి నోబక్షోణిపాలేంద్రు శ్రీ
నరసింహాధిపుఁడై జనించె మరుఁ డౌన్నత్యంబు దీపింపఁగన్. 115

ఔదార్యము —

సీ. అలబలీంద్రునిచేత నడుగు వెట్టఁగ నేర్చి, ధారాధరముచేత నిరువోసి
కానీనుచేఁ గంచుకముఁ బూనఁగా నేర్చి, యెలమి దధీచిచే నెముక బలిసి
క్షీరాంబురాశిఁ ద్రచ్చినవెన్న నీడేరి, నైలింపగవి చన్నుపాలఁ బెరిగి
కల్పపాదపఫలోత్కరములఁ జవి గాంచి, వనజారి నెమ్మేన ననఁగి పెనఁగి

తే. ధరణిఁ బ్రోదిసహించినదానకన్య, సకలయాచకబాంధవు లన్నుతింప
నీకరగ్రహణావాప్తి నెఱసె నౌర, సరసగుణహార యోబయనరసధీర. 116

తేజస్విత.—

సీ. బహుతరాశాభ్రాంతి బయలు వ్రాఁకక యున్నఁ, గువలయద్వేషంబు గోరకున్న
మీటితమ్ములవిరిపోటు సేయక యున్న, వారుణీసక్తికిఁ బాఱకున్న
జగతి నందఱఁ దను బగ లొనర్పక యున్న, దోషాభిభూతుఁ డై తొలఁగకున్న
ద్విజరాజపరిభవోద్వృత్తి సేకొనకున్న, సరసుల నింకింపఁ జాలకున్న

తే. సాటి యగువిశ్వవినుతశశ్వత్ప్రతాప, వైభవధ్వస్తదుర్వారవైరివీరుఁ
డైనయోబయనరసింహు నమితభువన, భవనభృతతేజమున కబ్జబాంధవుండు. 117

ధార్మికత్వము.—

చ. పలుకుట సత్యవాసన కపారవిరోధి జయోత్సవంబు గా
నలఘుయశోధనంబుకొఱ కంబుధివేష్టిత భూపరిగ్రహం
బలరు నగణ్యపుణ్యచరితాచరణంబున కాత్మజీవనం
బల సుజనావనంబుకొఱ కౌర నృసింహనృపాలమౌళికిన్. 118

వైదగ్ధ్యము.—

సీ. పవనజారికళలచేఁ దనివి నొందించిన, నిలఖేచరుఁడు ప్రాణ మిత్త్రు వనిన
వనదంబు తనకుజీవన మెల్ల నొసఁగిన, నెమ్మేను శిబికోసికొమ్మటన్న
నిగిమ్రానె సొమ్ము లిచ్చినసురమణి, మిన్నంది తలఁపులో మెలఁగుచున్నఁ
జేరి పాదము బలి శిరసావహించినఁ, బాఁకోధి దా నెంత భంగపడిన

తే. వారి నెవ్వారిఁ గా దని వసుధ నౌర, నిక్కముగఁ గీర్తికామిని నీకుఁ దక్క
నీదువైదగ్ధ్యగుణము వర్ణింపఁదరమె, పరనుతాటోప తొరగంటి నరసభూప. 119

క. ఆనయము నాయకనుగుణము, లనేకములు గలవు వాని నతివిస్తరభీ
తిని రూపింపఁగ లే నిఁక, ననుపమనేతృస్వరూప మభివర్ణింతున్. 120

నాయకస్వరూపము.

క. కీర్తిప్రతాపసుభగుం, డార్తావనుఁ డఖిలగుణగణాఢ్యుఁడు బాహా
వర్తితభూభరుఁ డై పరి, కీర్తితుఁ డగు భర్త కావ్యగీశప్రియుఁ డై. 121

కీర్తిప్రతాపసుభగత్వము.—

మ. అరినిర్భేదనధుర్య యోబయనృసింహా సింహసత్వాఢ్య నీ
వరసత్కీర్తిమరాళబాలిక భవద్వర్ధిషు శౌర్యప్రభా
భరితారుణ్యముఖాగ్రయై పరఁగుచుం బాల్నీరు నేకంబుగా
ధరఁ గావించుసమస్తవిస్మయకళాదానప్రవీణోన్నతిన్. 122

ఆర్తావనత్వము.—

మ. ఒకప్రహ్లాదుని నార్తుఁ గాచితి మదయోత్సేక మేకావన
ప్రకటం బౌనె యటంచుఁ దా బహుతరార్తత్రాణపారాయణో

త్సుకత శ్రీనరసింహుఁ డుర్వీనరసత్క్షోణీశుఁ డైపుట్టెఁ గా
కోకభూపాలున కిట్టియార్తభరణోద్యోగంబు వాటిల్లునే. 123

గుణాఢ్యత్వము.—

చ. అరయఁ బయోధిపాత్రమును నంజనశైలము కజ్జలంబుఁ ద
త్సురతరుశాఖ లేఖిని వసుంధర పత్త్రముఁ జేసి వేడ్కతోఁ
గరలి విరించిగేహిని లిఖించినఁ బారము వొంద దార ' మా
నరసనృపాలమౌళిసుజనస్తుతసద్గుణసంప్రదాయముల్. 124

భూభరణము.—

చ. విపులఫణాసహస్రమున వీఁక ధరింపఁగ నేని మేదిని
న్నిపుణత బాహుపీఠమున నిల్పె నృసింహుఁ డటంచుఁ బన్నగా
ధిపతి నిరంతరాద్భుతమతిం దల లూఁచ జరావిపాండురుం
డెపుడుఁ బురాణభోగి యని యెన్నుదు రాభుజగేంద్రు నందఱున్. 125

కావ్యగీతప్రియత్వము.—

మ. నరసింహుం డతిధీరవీరరససన్నాహంబు వాటించియుం
గరుణాకోమలుఁ డై రమావిమలశృంగారార్ద్రుఁ డై పొల్చుచా
తురిసాహిత్యజమర్మకర్మకఠినోద్యోగాదృతుం డయ్యు నీ
నరసింహేంద్రుఁ డనూనగానరససంధానప్రియుం డెంతయున్. 126

మ. అమరక్ష్మాధరధీర ధీరచితకార్యారంభ రంభాసమ
ప్రమదాధివ్యమనోనురాగఘటనాపాంచాల పాంచాలగౌ
ళముఖోర్వీనుతశౌర్య శౌర్యనవలీలాలోల లోలాభవ
ద్రమణీయాగమధర్మధర్మతనయప్రఖ్యాతసత్యవ్రతా. 127

క. కుటిలారిభయదధాటీ, పటుపటహాఢమన్ని నాదపరిపాటితది
క్తటపటలచటులమేధా, పటిమపరాభూతభూతపతిమణిహారా. 128

మాలిని. అలఘునయవిహారా హారనీహారతారా
హాలధరరుచిధారా హారకీర్తిప్రచారా
జలధివరగభీరా జైత్రకౌక్షేయధారా
లలితగుణవిచారా లక్కమాంబాకుమారా. 129

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశప్రతిభా
బంధుర ప్రబంధపఠనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ
సుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషావిశేషనిరుపమావధానశారదామూర్తి
మూర్తిప్రణీతం బైనకావ్యాలంకారసంగ్రహం బనుమహాప్రబంధంబునందు
నుపోద్ఘాతప్రకరణంబును నాయకగుణవర్ణనంబును నాయకస్వరూపకథ
నంబు నన్నది ప్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# నరసభూపాలీయము

## కావ్యాలంకారసంగ్రహము - ద్వితీయాశ్వాసము.

---


రాజితసదనకళా
ధారనిరంతరతరార్థిదారిద్ర్యహరా
నారాయణచరణార్చన
నారీజనతారతీశ నరసాధీశా. 1

తే. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల, ననఘ భవదీయనామధేయాంకితముగ
బహువిభక్తుల నొనరింతుఁ బద్యవితతి, నిచట నాయకభేదంబు లెట్టు లనిన. 2

క. ధీరోదాత్తప్రముఖులు, ధీరోద్ధతధీరశాంతధీరలలితు లీ
ధారుణి నలువురునాయకు, లారయఁ దల్లక్షణంబు లభివర్ణింతున్. 3

శా. ధీరాత్ముం డవికత్థనుండు కరుణోద్వేలుండు సత్వాఢ్యుఁ డా
ధీరోదాత్తుఁడు శౌర్యదర్పకుహనాధీనుండు ధీరోద్ధతుం
డారూఢి న్సమధీప్రసన్నుఁడు ద్విజుం డౌధీరశాంతుండు వృ
త్త్రారిం దోలినభోగిధీరలలితుం డై పొల్చునిశ్చింతతన్. 4

ధీరోదాత్తుఁడు:—

సీ. చలిచీమ నేనియుఁ జాఁ ద్రొక్కఁగాఁ జాలఁ, డేరీతి గెల్చెనో వైరివరులఁ
గల నైననిజవర్ణనలు సేయ వినఁ జాలఁ, డె ట్లందుకొనియెనో కృతిచయంబు
చెలు వొందుసాకారచేష్ట లెయ్యెడఁ గానఁ, డెట్లు నవ్వెనో యాత్మహితులతోడఁ
బరుషాక్షరంబులు వలుకఁ డెక్కాలంబు, నెట్లు భర్జించెనో హీనమతులఁ

తే. బరులఁ జేపట్టఁ డెలమిఁ జేపట్టి విడువఁ, దలయఁ డేమఱఁ దరి నైన నవగుణంబు
లెన్నఁ డోబయనరసధాత్రీశతిలక, మరయ నరలోకభాగధేయంబు గాదె. 5

ధీరోద్ధతుఁడు:—

మ. బలవద్వైరిభిదామదాభిరత మై భవ్యప్రతాపోజ్జ్వల
జ్వలనజ్వాలజటాల మై రణభయవ్యాసక్తతత్సన్నో

జలజాంధంకరణప్రగల్భకుహనాసంపాది యై పొల్చుఁ దా
నిలధీరోద్ధతవృత్తి యై నరపధాత్రీశోగ్రఖడ్గం బనిన్.

ధీరశాంతుఁడు—

చ. ఇనకులధుర్యుఁ డైననరసేంద్రునిచేతఁ బ్రతిష్ఠితంబు లై
ననఘ మహాగ్రహారములయందలిభూసురకోటిమేటి యై
ఘనతరశాఖలం జెలఁగి కాంతశుకక్రమ మై మెలంగున
య్యనిమిషభూజవాటిక్రియ నాత్తశుచిప్రసవాభిరామ మై.

ధీరలలితుఁడు—

ఉ. కుంతల గౌళ చోళ కురు ఘూర్జర హూణ శకాదిమేదినీ
కాంతులు సంతతంబు నిజగాఢబలశ్రుతిమాత్రభీతు లై
యింతులరత్నహారముల నెల్ల ధనంబుల నిచ్చి కొల్వ ని
శ్చింతతఁ దాల్చునోబయనృసింహుఁడు భోగకళాప్రవీణుఁ డై.

తే. మఱియు శృంగారలీలాసమగ్రయోగ్య, తానిశవిచక్షణులు దక్షిణానుకూల
ధృష్టశఠు లనఁ గాంతు లభీష్టమతులు, గలరు తల్లక్షణంబులు దెలివిపఱతు. 9

చ. చెలఁగుబహుప్రియాసదృశశీలుఁడు దక్షిణుఁ డొక్కకాంతకే
వలచి గుణాభిరాముఁ డగువాఁ డనుకూలుఁడు సాపరాధుఁ డై
యలుగనివాఁడు ధృష్టుఁడు ప్రియాశయమాత్రనివేద్యవిప్రియుం
డలశఠుఁ డండ్రు వీరల కుదాహరణంబులు నిర్ణయించెదన్. 10

దక్షిణుఁడు—

ఉ. సాగరమేఖలాసతికిఁ జారుభుజాపరిరంభ మిచ్చె వా
ణీగగనావలగ్నకును నేర్పుమెయి న్మొగ మిచ్చె వీరల
క్ష్మీగజరాజగామిని కమేయభుజాంతర మిచ్చె సంతత
త్యాగినృసింహభూవిభుఁడె దక్షిణనాయకుఁ డెన్నిభంగులన్. 11

అనుకూలుఁడు—

చ. కనకము లంబరంబులును గ్రామము లుజ్జ్వలదివ్యరత్నమం
డనములు వాజివారణఘటల్ ఘనసారసుగంధసారము
ల్దనివి దలిర్ప వేఁడినకొలంది నొసంగుచు నోబభూపనం
దనుఁ డగునారసింహుఁ డిల దానరమాప్రియుఁడయ్యె నెంతయున్. 12

ధృష్టుఁడు—

చ. ఉరమున నున్నకుంకుమముదుజ్జ్వలరోషకషాయవీక్షణ
స్ఫురదరుణాంశుపుంజ మని బొంకితి కన్గవకెంపు భాగ్యబం

ధురసహజారుణత్వ మని నూల్కొన నాడితి వెట్లు దాఁచెదీ
పరిమళవాసనాలహరిపర్విడు మేన నృసింహభూవరా. 13

శఠుఁడు—

చ. కనుఁగవఁ బాఁజూచెదవు గాని మనంబునఁ జూడ వుక్తులం
దనిపెదు గాని భారమునఁ దన్వొకప్పుడు నిప్రవీణత
ల్వనుపడ వింక నీసటలు బచ్చెనచేతలు చాలుఁ జాలునీ
జెనకకు కీర్తికాంత యె నృసింహప్రియాంగన నీ కెఱుంగుదున్. 14

క. ప్రకటీకృతు లగునీనా, యకులకు విటపీఠమర్గు లనఁ జేటవి దూ
షకు లనఁ గలరు ప్రియాకే, లికలాసంఘటనపటిమలీలాచార్యుల్. 15

చ. వసుమతి నేకవిద్య గలవాఁడు విటుం డనఁ బొల్చునాయకో
ల్లసనముకన్నఁ గొంతగుణలక్షణహీనుఁడు పీఠమర్దకుం
డసదృశబాలికాసుఘటనాదిరహస్యవిదుండు చేటకుం
డసఁగ నజస్రహాస్యరసహేతువువాఁడు విదూషకుం డిలన్. 16

క. ఈమతమున స్వీయాన్యా, సామాన్య లనంగఁ గలరు సతులందుఁ ద్రపా
సామగ్రీశీలార్జవ, కోమలకమనీయస్వీయగుణములఁ జెలఁగున్. 17

క. అన్య యనఁగ నవోఢయుఁ, గన్యయు సామాన్య యనఁగ గణికామణి యీ
మాన్యల కుదాహరణముల, నన్యాదృశవిశదఫణితి నాపాదింతున్. 18

స్వీయ—

చ. అమృతమువంటిసద్గుణము నంచితచంద్రకళావిలాసభా
వము శివగోత్రభూతియు నవారణఁ దాల్చి యశఃపురంధ్రి దా
గమలవనీహితాన్వయశిఖామణి యైననృసింహ మేదినీ
రమణుల కేకపత్ని యన రంజిలులోకము లెల్ల మెచ్చఁగన్. 19

అనోఢ—

సీ. పారసీకక్షమాపతులచొప్పడఁగించి, నేర్పు మీఱఁగ మోహనిద్ర పుచ్చి
యవనసేనాధినాయకులదోస్స్తంభసం,భరితప్రతాపదీపంబు లడఁచి
యభిభూతఖానమల్కావిష్కృతాయశో,ధ్వాంతసంతతికాత్మసంత సిల్లి
సమదముష్కతురుష్కప్రాప్తసీమల, నడుగు మోపఁగనీక యరుగు దెంచి

తే. ప్రాజ్యసామ్రాజ్య యగువారిరాజ్యలక్ష్మి, కదనసంకేతమున జారకాంత యగుచు
నంచితస్ఫూర్తి నిన్ను వరించె నౌర, వైరిగజసింహ యోబయనారసింహ. 20

కన్య—

శా. అజానేయము నెక్కి యోబయనృసింహస్వామి వాహ్యాళిరా
నోజం గాంచనసౌధవీథికఁ దదీయోల్లాసముం జూచి మా

తేజోవిభ్రమధన్యకన్యమదనార్తిం జెంది ప్రాసాదపా
లీజాగ్రన్మణిపుత్రికానియతిఁ దాల్చెం దద్గతస్వాంత యై. 21

సామాన్య—

క. ఏరీతి వారు చెందిన, నారీతిఁ దదీయరాగ మందెడినారా
వారాంగన యది సాక్షా, త్కారపుఁ బటికంపుబొమ్మ గాఁ బోలుఁ జుమీ. 22

క. ఈముగువల కాద్యయు ము, గ్ధా మధ్యా ప్రౌఢ లనఁగఁ దగు నవ్యవయో
వ్యామిశ్రితయోగ్యము లగు, నామములు తదీయలక్షణము లేర్పఱుతున్. 23

చ. నవనవకామయౌవనసనాథయు నల్పరతంబు గల్గు న
య్యువిదయె ముగ్ధ మధ్య సదృశోదితయౌవనకామ యై రతాం
తవివశ యౌలతాంగి సతతప్రథితోల్బణకామయౌవనో
త్సవము రతాదిమోహమును దాల్చుతలోదరి ప్రౌఢ దా నగున్. 24

ముగ్ధ—

శా. ఆలాపంబున కుత్తరం బొసఁగ దాయాసంబునం గాని తా
నాలోకింపదు పాటలాధరమరందాస్వాదసమ్మర్దముం
దాళం జాలదు కౌఁగిలియ్యదు తనూతాపంబు చల్లాఱఁగా
నే లజ్జావతి తద్రతంబు దయితాభీష్టంబు గాకుండునే. 25

మధ్య—

ఉ. మానితవైఖరిన్మణితమంత్రములం గబరీవినిర్గళ
త్సూనములం బ్రసూనశరశూరునిపూజ లొనర్చి తా రతి
స్థానిని యొప్పె నప్పుడ సమానమనోంబుజవీథి నాతనిన్
ధ్యానము సేయుకై వడి రతాంతనితాంతనిమీలితాక్షి యై. 26

ప్రౌఢ.—

మ. నటదుత్తుంగపయోధరంబు జితమందాక్షక్రియోదారమ
స్ఫుటవాగంకుర మక్షికోణనివసత్పుష్పేషుదర్పంబు సం
ఘటితాలింగనవామనీకృతకుచాగ్రప్రౌఢరోమాంచ మై
విటుఁ జొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనావీరాయితం బెంతయున్. 27

క. ధీర యధీరయు ధీరా, ధీరయు నగు నందు మధ్యధీరాధీరా
ధీరాధీరాహ్వయముల, ధారుణిఁ బ్రౌఢయుఁ జెలంగుఁ దల్లక్షణముల్. 28

తే. తప్పు గలభర్త మ్రోలసోత్ప్రాసఫణితిఁ, గేరడము లాడుసతి మధ్యధీర సాశ్రు
పరుషవచన యధీర సబాష్పకుటిల, హారివచన ధీరాధీర యనఁగఁ జెలఁగు. 29

తే. కాంతుఁ డపరాధి యైన నాకారగుప్తిఁ, బరఁగి రతివేళ నలయించుఁ బ్రౌఢధీర
తాడనోగ్ర యధీరయుదగ్రకుటిల, ఫణితియు ధీరయాఖ్యవీరి నేర్పులుతువసన. 30

మధ్యధీర—

ఉ. మోమున ఘర్మశీకరసమూహము గానఁగ నయ్యె నిప్పు డా
రామవిహారకేలిని భరంపడినాఁడవొ నన్నుఁ బాసి యీ
కేమదనాస్త్రఘాతముల వేఁగితొ నీయుర మెల్లఁ దద్వ్రణ
స్తోమము సోఁకియున్నయది చొప్పడఁ గాంత యెఱుంగఁ జెప్పుమా.

మధ్యాధీర—

శా. చాలుం జాలుఁ బిసాళి నేఁతలు పదాబ్జాతంబుపై మాటికిన్
వ్రాలం బోకు భవత్ప్రియానఖవిమిశ్రం బైన నీవక్షమీ
నీలస్థాపితకుట్టిమం బొరసిన న్వైధంచు లే లెమ్ము నీ
బాలాసంగమసౌఖ్యవైభవము సూప న్వచ్చితే యిచ్చటన్. 32

మధ్యధీరాధీర—

చ. పలుక వటంచు నేమిటికి బాములఁ బెట్టెదు కాంత నీవయిగ
దెలియఁగఁ దప్పు లేమికిని నిన్నఁ జాలక యూరకుండినం
బలుమఱు సాపరాధుగతిఁ బల్కెద వెన్నఁడు దప్పు నీయెడం
గలుగునె యంచు నించెఁ దెలిగన్నులనీరు లతాంగి యంతటన్. 33

ప్రౌఢధీర—

చ. హితమతిఁ ధూర్తభర్త కెదురేఁగెడు నేర్పున నేకపీఠసం
గతి వారియించి పల్కుటయుఁ గ్రక్కున నెచ్చెలి కూడికంబులం
జతురత నేర్పు చందమున జాఱఁగఁ ద్రోచి యతిప్రగల్భ యా
సతియుపచారగౌరవము సల్పెదునట్లు వహించుఁ గోపమున్. 34

ప్రౌఢాధీర—

చ. వరునిఁ గృతాపరాధుని సవారణవారణయానయాసునం
గరలి భుజాగుణంబున బిగించి వతంసితసారసంబునం
గరము దమింపఁగాఁ దొడఁగెఁ గాంతుని సాంత్వనశీత లోక్తు లాం
తరనిజకోపతప్తఘృతధారకకారణవారిధారగాన్. 35

ప్రౌఢధీరాధీర—

చ. బొమముడిపాటు జంకెనయుఁ బూని పురంధ్రులు సాపరాధు లౌ
రమణులు వేడుకొన్న నను రాగము దాల్చుదు రట్లు గాదు మ

త్కృమ మపరాధ లేశమును దాల్పనిసీ విపు డెంత మ్రొక్కినం
దెమలదు శాంతిఁ బొందను మదీయమనం బికఁ జాలుఁ బ్రార్థనల్. 36

క. ధారుణిమధ్యయుఁ బ్రౌఢయుఁ, ధీరాధీరాదిభేదదీపిత లై వే
ర్వేరను జ్యేష్ఠ కనిష్ఠయు, నై రంజిలి ద్వాదశాఖ్య లగుదురు వరుసన్. 37

క. కావున స్వీయ త్రయోదశ, భావంబు వహించునన్యపరఁగుద్విధ యై
యావారాంగన యేకవి, ధావహ య ట్లెన్నఁగాఁ బదాఱ్వురు సుదతుల్. 38

తే. మఱియు శృంగారశంభుసంభావితాష్ట, తనువు లన నిమ్మృగాక్షులు వినుతిఁ గాంతు
రష్టవిధభేదములవీరియాహ్వాయములు, లక్షణము లేర్పరించెద లలితఫణితి. 39

సీ. వరుఁడు వైవశ మైనవనితస్వాధీనభ, ర్తృక ప్రియాగమవేళ గృహముఁ దనువు
సవరించునింతివాసకసజ్జపతిరాక, తడవుండ నుత్కంఠఁ దాల్చునింతి
విరహోత్కసంకేత మరసి నాథుఁడు లేమి, వెస నార్త యాకాంత విప్రలబ్ధ
విభుఁ డన్యసతిఁ జెంది వేకువరాఁ గుందు, నబలఖండితయల్క నధిపుఁ దెగడి

తే. యనుశయముఁ జెందుసతికలహాంతరితని, జేశుఁడు విదేశగతుఁ డైనఁ గృశతఁదాల్చు
నతివప్రోషితపతిక కాంతాభిసరణ, శీలయభిసారికాఖ్య యై చెలువు మెఱయు. 40

క. ఈరీతిఁ జెలఁగు నతిశృం, గారకలాకలితనాయికామణులకు వే
ర్వేర నుదాహరణంబులు, భూరిమధురవచనరచనముల నేర్పఱుతున్. 41

స్వాధీనపతిక—

ఉ. శ్రీనిధి యోబభూవరునృసింహుఁడు కైవస మై చెలంగఁగా
భూనుత వైభవస్ఫురణఁ బొల్చుయశోజలజాక్షి నిత్యస
మ్మానితశీల యై ధవుని మన్నన నౌదల యెక్కినట్టి వై
మానికవాహిని న్నగు నమందనిజాతిశయంబు పేర్మికిన్. 42

వాసకసజ్జిక—

చ. యవనచమూసమూహముల నాజి జయించి యుదగ్రదిగ్జయో
త్సవవిభవాభిరాముఁ డయి సారెకు నోబయనారసింహభూ
ధవుఁ డరుదెంచులగ్నమునఁ దత్పురలక్ష్మివిభూషితోల్లస
ద్భవనవిశేష యై మృగమదద్రవవాసనఁ దాల్చునిచ్చలున్. 43

విరహోత్కంఠిత—

ఉ. నెచ్చెలి లీనృసింహధరణీవరుఁ డెచ్చెద మంచుఁ బోయి రా
రిచ్చట నీవునుం గరుణ యించుక లే కలరంప గుంపులన్
గ్రుచ్చెద వేల మత్ప్రియునిఁ గూర్పుము మన్మథ నీకుఁ దద్విభుం
డిచ్చుటకై యొసంగెద మదీయకటాక్షముల న్జయాస్త్రముల్. 44

విప్రలబ్ధ—

చ. ఎనయఁగ నీనివాసమున కే నరుదెంచెద నంచు నాపయిం
గనుఁగొన నిక్కుపుం బ్రియము గల్గినవాఁడును బోలెఁ బల్కి యీ
మనికికి రాక తక్కి నను మానెడుఁ గాక మదీయదృష్టికిం
బనుపడి మ్రోల నున్నగతి మాయలు సేయఁగ నేల భర్తకున్. 45

ఖండిత—

చ. నృపులకు నెల్లవారల భరించుట యోగ్యము గాన నేఁటి కే
యపరిమితోత్సవంబునఁ బ్రియాసదనంబుల కేగి యేగి యా
నెపమున మద్గృహంబునకు నీ వరుదేరఁ బ్రభాత మయ్యెఁ గా
కిపుడు నృసింహ నీపయి నొకించుక వంచనలే దెఱుంగుమన్.

కలహాంతరిత—

ఉ. ఆనఁగ రానికోపమున నప్పుడు కాంతుని ధిక్కరించుచో
మానదురాగ్రహగ్రహము మానుపలే కపు డెందుఁ బోయెనో
యీనవవింటిదంట యపు డేఁపఁ దొడంగె భవిష్యదర్థము
గ్గానని నా మనంబునకుఁ గావలె నిట్టి విషాదవేదనల్. 47

ప్రోషితభర్తృక:—

చ. చిరయశయోంబభూవరునృసింహభవద్రిపుభామకాననాం
తరమున కేగి యందు నిజనాథునిఁ గానక మన్మథార్తయై
వరునివరోజపత్త్రమున వ్రాయనెడం గరము ల్సెమర్పఁగా
నరయ నిజాంగకంబె పగ యయ్యె నటంచుఁ దలంచు దైవమున్. 48

అభిసారిక—

ఉ. నాతిమదిం బ్రియాభిసరణం బొనరింపఁ దలంచె దీవు చం
ద్రాతపసాంద్రదీధితు లజాండకటాహము నిండఁ బర్వఁగా
సీతలఁ బెట్టు గూడు రమణీవలె నే నొకవన్నెఁ గాఁగ ము
క్తాతతులుం బ్రసూనములు దాల్పు మలందుము గంధసారమున్. 49

క. ఈయెనిమిదిభేదంబులఁ, బ్రేయసులు పదాబ్జవరం బ్రభిన్నాత్మిక లై
యాయతగతి నిల నూటిరు, వైయెనిమిది భేదములును వఱలుందు రెలమిన్. 50

క. ఇల నీసంఖ్యలఁ దగుసతు, లల యుత్తమమధ్యమాధమాభిఖ్యలఁ జె
న్నలరఁగ మున్నూటెనుబది, నలువురు నాయిక లటంద్రు నవరసరసికుల్. 51

## కావ్యస్వరూపము.

తే. ఇంకఁ గావ్యస్వరూపంబు దేర్పరింతు, విగతదోషంబులును గుణాన్వితము లధిక
లసదలంకారభావోపలక్షితములు, నైన శబ్దార్థములు కావ్య మనఁ జెలంగు. 52

క. తను వగుశబ్దార్థంబులు, ధ్వనిజీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరుగుణంబులు గుణములు, ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్. 53

తే. అందు వాచకలక్షకవ్యంజకంబు, లనఁగ శబ్దప్రపంచంబు వినుతి కెక్కుఁ
ద్రివిధమై యర్థజాతంబు తేజరిల్లు, నవని వాచ్యంబు లక్ష్యంబు వ్యంగ్య మనఁగ. 54

తే. శబ్దవృత్తులు నభిధలక్షణ యనంగ, వ్యంజన యనంగఁ బెను పొందు నందు నభిధ
సతతసంకేతితార్థగోచరసుశబ్ద, ధామ మై యోగరూఢిభేదములఁ జెలఁగు. 55

యోగమూలాభిధ—

చ. అలఘుబలాభిరాముఁ డగునౌబళ రాజన్నసింహమేదినీ
తలబలవైరిదానజలధారల నిచ్చలుఁ దేలి తేలి త
ద్గళితవిరోధిశోణితనదమ్ముల నిమ్ములఁ గూడి కూడి యా
జలధులు వాహినీశు లనఁ జాలఁ జెలంగుఁ బయోనిధానముల్. 56

రూఢిమూలాభిధ—

క. కులమణియై బలవద్రిపు, కులగిరికులిశంబు నై యకుంఠితధర్మా
కలనకలాలాలసుఁ డయి, వెలయు న్నరసింహవిభుఁడు విశ్వోన్నతుఁ డై. 57

తే. ఇంక లక్షణ వివరింతు నిందు గౌణ, వృత్తియు నభిన్న మై పొల్చు నెట్లటన్న
క్షోణిసురుఁ డగ్ని యనునెడ శుచిగుణంబు, వాచ్యవిభవాభిభావియై వఱలుకతన.

క. బంధుర యగులక్షణసం, బంధానుపపత్తిమూలభావన నది సం
బంధనిబంధనసామ్యని, బంధన యని రెండుగతులఁ బరఁగుచు నుండున్. 59

తే. అందు జహదభిధేయయు నజహదర్థ, యనఁగ సంబంధలక్షణ యలరు సామ్య
గుణనిబంధన తాను ద్వైగుణ్యమందు, జగతి సారోపసాధ్యవసాయ యనఁగ. 60

సీ. అలగంగలో ఘోష మగునెడ గంగాపదంబు సంబంధి యౌతటము దెలుప
సంబంధలక్షణ జహదర్థ యగు నందు, మంచె మ్రోసె నటన్న మంచగతులు
దోఁచుఁ గోదండపఙ్క్తులు వచ్చె ననిన వింట్ల, నమరు యోధులు దోఁప నజహదర్థ
యవనిపాలుఁడు సింహ మనువేళ నదృశతా, గుణసిద్ధి సామ్యలక్షణ చెలంగు;

తే. నందు నుపమాన ముపమేయ మప్రభిన్న, మైన సారోప్య యుపమాన మగదిలోప
మేయ మై యున్న సాధ్యవసాయ యిట్టి, లక్షణల కన్నిటి కొనర్తు లక్ష్యములను.

జహల్లక్షణ.—

చ. అగణితశౌర్యధైర్యవిభవాన్విత యోబయనారసింహ నీ
గగనచరామరాగశిబికర్ణజయోన్నతదానలక్ష్మికిన్
జగములు సంతసిల్లె నతిసాంద్రభవజ్జయభేరిభాంకృతి
ద్విగుణితసైన్యఘోషముల వే వడఁకె న్రిపుపట్టణావళుల్. 62

అజహల్లక్షణ.—

క. అసమరణరంగమున నీ, యసిపటి నటియింపఁ గరుల హరుల న్నిరులన్
వెస నొసఁగు నౌర యెంతటి, రసికుఁడు నీవైరి యోబరాజనృసింహా. 63

సారోపలక్షణ.—

మ. అమరద్వీపవతీఘురాంతరములం దారూఢి నీలాంబుపూ
రము సూర్యాత్మజఁ గాఁ దలంపుదురసారప్రౌఢిమైఁ గొంద ఱు
ద్యమతేజోధిక నారసింహ భవదుద్యత్కీర్తినిర్ధూతసం
భ్రమ యాగంగయ కీర్తి దాల్చె నని నే భావింతుఁ జిత్తంబునన్. 64

సాధ్యవసాయలక్షణ.—

క. నిరతబుధప్రహ్లాదా, దరకరుఁడు హిరణ్యకశిపు దానోన్నతుఁ డై
ధరఁ బోచిరాజవంశ, స్థిరరత్నస్తంభమున నృసింహుఁడు పుట్టెన్. 65

క. సంగతము లగుపదార్థము, లం గలవాక్యార్థమున కలంకారం బై
రం గగు నర్థాంతర మర, యం గావ్యములందు వ్యంజనాఖ్య చెలంగున్. 66

క. ప్రకృతోపపన్న కభిధకుఁ, బ్రకృతానుపపత్తిగోచరకు లక్షణకున్
బ్రకటితవిభేద్యవ్యంజన, ప్రకృతాప్రకృతోపపత్తిఁ బరఁగెడుకతనన్. 67

ఆ. జగతి నదియు శబ్దశక్తిమూలంబును, నర్థశక్తిమూల మరయ నుభయ
శక్తిమూల మనఁగ సన్నుతిఁ గాంచుఁ ద, దీయలక్ష్యములను దేటపఱుతు. 68

శబ్దశక్తిమూలవ్యంజన.—

క. ఘనతనృసింహునికరమునఁ, దనరెడునసి నిజసమగ్రధారాగ్ర నిమ
జ్జనతత్పరు లగునరులకు, ననిమిషభావం బొనర్చు ననవరతంబున్. 69

అర్థశక్తిమూలవ్యంజన.—

చ. అలఘుపరాక్రమక్రమసమగ్రభుజాగ్ర నృసింహభూప నీ
విలసదనూనదానగుణవిభ్రమ మెంతయు నాలకించి తా
వెలవెలఁ బాఱె మేఘ మరవిందవిరోధియుఁ గందువాఱె నా
కులపడెఁ గల్పశాఖి తృణకోటి గ్రసించె నమర్త్యధేనువున్. 70

ఉభయశక్తిమూలవ్యంజన.—

క. అరిదరకరుఁడై సుమనో, వరభరణధురీణుఁడై యవారితలక్ష్మీ
స్థిరవాసభాసురుండై, నరసింహుఁడు వొల్చుఁ ద్రిభువనస్తుతమహిమన్. 71

తే. మఱియు రచనాశ్రయంబులై మధురరసని, వేశయోగ్యత వృత్తులు కైశికియును
నారభటియును సాత్వతి భారతియును, నాఁగ బొగడొందుఁదల్లక్షణము లొనరు.

మ. చెలఁగుం గైశికి కోమలార్థరచనాశ్రీమద్గతార్థక్రమా
చలితాడంబరమూర్తి యారభటి యూపత్ప్రౌఢసందర్భని
ర్భల యౌభారతి పొల్చు సాత్వతియు నివతోక్కమలార్థక్రమం
బుల నివృత్తులకు న్యథోచితరసస్ఫూర్తు ల్నిరూపించెదన్. 73

తే. కైశికి చెలంగు శృంగారకరుణలందు, నారభటి రౌద్రభీభత్సహారిణి యగు
నలరు భారతి హాస్యశాంతాద్భుతముల, నమరు సాత్వతి వీరభయానకముల. 74

కైశికి.—

ఉ. తిన్ననిమేను గన్నుఁగవ తేటలు దేనియ లొల్కుమాటలున్
సన్నపుఁగౌను గుందనపుఁజాయలు దేఱు మెఱుంగుఁజెక్కులుం
గ్రొన్నెలవంటినెన్నుదురు గుబ్బచనుంగవ తెక్కుఁజూపులున్
జెన్నెసలారఁ గన్య నరసింహునిఁ జూచె విలాసధన్యయై. 75

ఆరభటి.—

మహాస్రగ్ధర. ప్రతిపక్షక్ష్మాపవక్షఃఫలకవిదళనప్రౌఢగాఢప్రతాప
ప్రతిభాసంరంభగుంభప్రబలసుబలశుంభన్నృసింహోగ్రరంహో
యుతమై కల్పాంతదృప్యద్ద్యుమణిధగధగప్రోద్యతజ్వాలజాల
ప్రతికూలప్రక్రమంబై పరఁగు నరసభూపాలదోఃఖడ్గమాజిన్. 76

భారతి.—

సీ. నీకీర్తి కన యని నెగడినసురదంతి, శిరము మధ్యే భిన్నతరము గాదె
నీకీర్తితోఁ బ్రతినెరసినయిందుమం, డలము పదాఱుఖండములు గాదె
నీకీర్తి నొరసినకాకోదరస్వామి, తల సహస్రచ్ఛిదాకులము గాదె
నీకీర్తిఁ బోలఁ బూనినధవళాంభోజ, తతి శతధా దళితంబు గాదె

తే. యహహ నీకీర్తికవనిలో నమరకరియు, గిరియు నిందుండు గిందుండు సురగపతియు
గిరియుఁ జెలిదామరలచాలు గెలువ నెనయె, శ్రీయాబలేంద్రునినారసింహక్షితీంద్ర.

సాత్వతి.—

చ. ఉభయరగండ తావకరణోగ్రజయానకము ల్ఘుభుల్ఘుభు
ల్ఘుభు లని మ్రోయఁగా భవదకుంఠితవీరభటు ల్భ్రిభుల్భ్రిభు

ల్పవిభు లని శత్రుభూపతులపైఁ జొరఁ బాఱ నెడ న్విభుల్విభు
ల్విభు లని సంభ్రమింపుదురు వేడ్కనఖర్వసుపర్వభామినుల్. 78

తే. ఇంక రీతులు వివరింతు వృత్తు లట్లు, సముచితార్థపదన్యాసస్థాపనములు
గాక సందర్భమాత్రసంగతము లైన, కతన రీతులు వృత్తిభిన్నతఁ దెలంగు. 79

తే. పరఁగురీతులు కోమలప్రౌఢపదవి, ధానవాసన నందు వైదర్భి యనఁగ
గౌడి పాంచాలి యనఁ బొల్చుఁ గ్రమముతోడ, వీనికిని లక్షణంబులు విస్తరింతు.

తే. అతిమృదులబంధయుతయనాయతసమాస, దనరు వైదర్భిరూక్షబంధయును ఖరస
మాసయుగు గౌడియుభయాత్మమహిమగల్గి, యలరు బాంచాలివీనిలక్ష్యము లొనర్తు.

వైదర్భి.—

శా. ఆలావణ్య మగణ్య మాగుణగణం బవ్యాజ మాతేజ ము
ద్వేలం బావినయం బమేయతర మావీర్యం బనిర్వాచ్య మా
యాలాపం బతిసత్య మావితరణం బాశాంతవిశ్రాంత మా
శీలం బార్జవమూల మెన్నఁ దరమే శ్రీనారసింహేంద్రునిన్. 82

గౌడి.—

శా. అంభోరాశిగభీర యోబయనృసింహా నీ రణోదస్తదో
స్స్తంభోత్తంభితజృంభితాసిలతికాసంరంభసంభావనా
దంభానర్గళదుర్గదుర్గమమదోద్యద్దుష్టధృష్టారిరా
ట్కుంభచ్చుంభనిశుంభసంభ్రమహరస్ఫూర్తి న్విజృంభించురా. 88

పాంచాలి.—

శా. ఆరూఢిం దప మాచరించెదవు చంద్రా యల్లమందాకినీ
తీరక్షోణితటిన్మహానటజటాదీరాటవీవాటిలోఁ
బ్రారబ్ధం బగుమేనియంకము హరింప న్వేఁడి యిం తేల నీ
కారాధింపఁగ రాదె యోబయనృసింహాధ్యక్షుసత్కీర్తులన్. 84

ఉ. పాక ముదీరితార్థపరిపాక మనం దగు నందు గోస్తని
పాకము నారికేళఫలపాక మనన్ ద్వివిధంబు గోస్తని
పాకము సంవృతార్థపరిపాకనివేద్యము నారికేళపా
కాకలనంబు గూఢనిబిడార్థవిచార్యము వీనిలక్ష్యముల్. 85

ద్రాక్షాపాకము.—

క. వాలిక లై వెలిదమ్ముల, పోలిక లై చందమామ పులుఁగులకును దా
మేలిక లైననిరీక్షణ, మాలికల నృసింహుఁ జూచె మదవతి వేడ్కన్. 86

మాలాదీపకము.—

క. మహిఁ బూర్వపూర్వమునకుఁ, దహి మీఁదగి నుత్తరోత్తరము రమ్యగుణా
వహమగు మాలాదీపక, మహీనవిఖ్యాతిఁ జెలఁగు నది యెట్లన్నన్. 226

క. గురుచాపముచే శరతతి, శరతతిచే శత్రుశిరము శత్రుశిరముచే
ధర ధరచే నీబాహువు, పరిలబ్ధం బయ్యె నోబపార్థివునరసా. 227

సారము.—

క. నిరవధిక ముత్తరోత్తర, నిరతోత్కర్షంబు దెలుప నిఖిలకృతులయం
దరుదై తగు సారాలం, కరణము కవివినుత మగుచుఁ గడు నెట్లన్నన్. 228

సీ. స్థావరజంగమాధారము త్రిజగంబు, లలజగంబు లజాండములఁ జెలఁగు
నాయజాండము లుండు వారిరోమకూపము, దాశౌరియును భోగిపై శయించు
నాభోగి జలధికోణావాస మొందు నా, కడలి కుంభజు చులుకంబుఁ జెందు
నాకుంభజుఁడు నింగి కేకఖద్యోతాభుఁ, డానింగి కబరి యై యతిశయిల్లు

తే. నీయశోలక్ష్మి కక్షీణనీతిచతుర, చతురుదధిమేఖలావృతక్షితిధురీణ
చటులభుజదండదండితోత్కటమదారి, వీరపరివార యోబభూవిభునృసింహ. 229

క. రసవత్ప్రియము లూర్జ, స్విసమాహితములును నిచట వివరింపఁగ లే
దసమరసప్రకరణమున, రసభావాద్యుపనిబద్ధరసములు గానన్. 230

ఉ. సొమ్ములు సొమ్ములుం గలయుసొంపులఁ బుట్టెడురీతిఁ గార్యజా
లమ్ములయం దలంకృతు లలంకృతులుం గలయంగ శోభ మై
నిమ్మహిఁ బొల్చుఁ దద్ఘటన మెన్నికతోఁ దిలతండులా స్థిరూ
పమ్మునఁ బాలునీరనయుభాతిఁ దగున్ద్వివిధత్వ మొందుచున్. 231

క. తిలతండులరూపమ్మున, నలరు న్సంసృష్టిసంకరాఖ్యము పాలీ
రిల నేక మైనకైవడిఁ, దెలుపుం దత్సంకరంబు త్రివిధము కృతులన్. 232

తే. ఎనయ నంగాంగిభావంబు నేకవాచ, కానుబంధంబు సందేహ మనఁగ నెట్లు
పొలుచు సంసృష్టిసంకరంబులకు వరుస, లక్ష్యముల నేర్పరించెద లలితఫణితి. 233

సంసృష్టి.—

క. వారిదబలాకులగిరికుచ, వరచందనరజము లగుభవత్కీర్తిరుచుల్
నిరవద్యసుధాంభోధి, స్ఫురణంబు వహించె నోబభూవరునరసా. 234

క. వారిదబలాచందన మయి, యరు దగునను రూపకంబు నమృతాంభోధి
స్ఫురణంబుఁ దాల్చె ననియెడి, సరసనిదర్శనయుఁ బొల్చు సంసృష్టి యనన్.

అంగాంగిభావసంకరము.—

క. అనిజిహ్వాభయదం బై, యసమమహాబలవిశేషహారియు నై యి
వ్వసుధ భవద్భుజదండము, బొసఁగుఁ ఫణిమాడ్కి నోబభూవరునరసా. 236

క. ఆనిజిహ్వాక యనురూపక, మసమమహాబలవిశేషహారిశ్లేషం
బెసఁగు ఫణిమాడ్కి భుజమను, వెస నంగాంగిత్వ మొందెఁ దెలియ నుపమతోన్.

ఏకవాచకానుప్రవేశసంకరము.—

క. విశ్వామిత్రమదాసహ, శాశ్వతసౌభాగ్య మగుమ సతతోన్నత మై
విశ్వనుతశ్రీనృసింహము, హిశ్వగ నియని వసిష్ఠునిడమబోల్చున్. 238

క. నీవాలు వసిష్ఠునివలె, నేవేళఁ జెలంగు నన్న నేకపదవిశే
షావిర్భూతము లగుచున్, శ్రీవెలయన్ శ్లేష ముపమ చెలఁగును నిచటన్. 239

సందేహసంకరము.—

క. పాకారితురగరాకా, శోకారికహానుకారికోమలరుచియై
యేకాలము గఁజిల్లును, నీకీర్తిమరాళి యోబనృపవరసింహా. 240

క. ఇలఁ గీర్తి హంసి యనుచో, సలలితగతి హంసివంటిసత్కీర్తియె కా
కిలఁ గీర్తి యనెడుహంసియొ, తెలియ దుపమరూపకంబు తేటఁగ నిచటన్. 241

క. ఈరీతిం గొన్నియలం, కారము లేర్పఱిచినాఁడఁ గడమదడమనే
నేరక వర్జించుటగా, దారయ విస్తారభీతి నాపాదింపన్. 242

శా. మక్షామండుపపండువాఘయదదోర్దాహాత్త్యక్షాటీమహా
తుక్షార ప్రతిరుద్ధభూభునవహిందూరాజ్యసంస్థాపనా
ప్రాక్షదోర్బితకులోత్థితధ్వజపట ప్రాయప్రసర్పద్యశ
స్సృక్షిర్వీక్ఱతశర్వకంక ణనమస్యాజాలకోలాహలా. 243

క. సాహిత్యభోజ భూజన, సౌహిత్యనిదాన దాన సంతానమహా
బాహావదానవాహా, గోహాణరేవంతలలితరూపజయంతా. 244

సర్గపంచకరహితసుగంధివృత్తము.

హారహీరసారసారిహారశైలవాసవో, ర్వీరుహాహిహారశేషవేషహాసలాలస
శ్రీరసోరుయాశసాంశుశీలవైరివీరసం, హారసారశౌర్యసూర్యహార్యవార్యసాహసా.

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితాసారసారస్వతాలంకార నిరంకుశ ప్రతిభాబంధుర ప్రబంధపరనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషావిశేషనిరుపమావధాన శారదామూర్తి ప్రణీతం బైన వరసభూపాలీయం బనఁ దద్రాజనామధేయాంకితం బై పొల్చుకావ్యాలంకారసంగ్రహం బనుమహాప్రబంధఁబునం దర్థాలంకారవిభాగఁబును సంకరసంసృష్టినిర్ణయఁబు నన్నది సర్వఁబును బంచమాశ్వాసము సంపూర్ణము.



'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.—1920.